# నిత్య మృత్యు సంగీతం

- ఆరుద్ర

ఇటీవల నేను మరణించబడుతున్నప్పుడు
హఠాత్తుగా ఆవలింత
అమర భూపాలీరాగ మయింది.
కుండలీకరణాలలో
పరస్పరం స్పందించిన
రెండు గుండెల చప్పుళ్ళు
తబలా తరంగిణిలా నినదించేవి.
తనువులోని ఆణువణువూ శివుడై
తాండవం చేస్తున్నప్పుడు
వచన వాగ్గేయకారుడు
వెనక పాట పాడటానికి విచ్చేశాడు.
అంబరం తంబురా అయింది
విరామ మెరుగని వ్రేళ్లు
మెరుపు తీగల్ని మీటుతున్నై.
నా రక్తంలోని ఎర్రదనాన్ని
తొలి మలి సంజలు ఎరువు తీసుకున్నాయి.
ఆధునిక విక్రాంతి పురందరులు
నా వెన్నుపూసను
నూతన వజ్రాయుధంగా మలుచుకున్నారు.
నా రెండు కళ్ళూ
వాళ్ళకు వెయ్యి కళ్ళయ్యాయి.

అందరికీ అన్నీ ఇచ్చేసి
అగ్నిలో నెత్తురు స్నానం చేసిన నేను
బావుటానై ఎగురుతున్నాను.
నా మెదడులోని కంప్యూటర్లో
కామాలున్నాయి, సెమికోలన్లున్నాయి
ఫుల్‌స్టాపే లేదు!

(ప్రముఖ అభ్యుదయ కవి ఆరుద్రగారికి ఇటీవల చాలా జబ్బు చేసింది. మృత్యు ముఖంలో ప్రవేశించి బయటపడ్డారు. ఆ అనుభూతితో ఈ కవిత అల్లారు. 13-5-1996 నాడు సాయంత్రం 6 గంటలకు చైతన్య కవిత సంపాదకుల తంగిరాల సుబ్బారావుగారు మద్రాసులో ఆరుద్రగారిని కలిసినప్పుడు పై కవితను ఆశువుగా చెపుతూంటే తంగిరాల వ్రాసుకున్నారు)

☆☆☆

''కాలానికి ఒక రూపం లేదు దానికి పాపం లేదు
కాలం అద్దం లాంటిది
అంధయుగమైనా స్వర్ణయుగమైనా అది మన ప్రతిబింబం
కాలం వలయం లాంటిది దానికి కేంద్రం లేదు
ఎవడికి వాడే యిచ్ఛా ప్రయత్న బలంతో
వర్ణోజ్వల వలయాలను సృష్టించ గలుగుతాడు
కాలం జాలం లాంటిది
కళ్ళు మూసుకుని నడిస్తే ఉచ్చులో పడతాడు
శక్తిపరుడు యుక్తిపరుడు దాన్ని ఛేదిస్తాడు

కాలం సవాల్ వంటిది
సాహసవంతు డందుకొని ముందు సాగిపోతాడు
చప్పబడిన పెద్దన్నయ్య చతికిలబడిపోతాడు

– తిలక్ – 'శిఖరారోహణ'

# చైతన్య కవిత

23
ధాత నామ సంవత్సరం
వసంత ఋతువు
ఉగాది

APRIL 1996

సంపాదకులు
తంగిరాల సుబ్బారావు
ఆర్వీయస్. సుందరం

చైతన్య కవితా వేదిక
ఆర్-2, జ్ఞానభారతి
బెంగుళూరు 560 056

**CHAITANYA KAVITA,** a Journal devoted to Telugu Poetry and published by Chaitanya Kavita Vedika, R-2, Jnana Bharathi, Bangalore University Campus, BANGALORE 560 056. April 1996.

PP.Q x + 73

ముఖచిత్రం : ప్రముఖ అభ్యుదయ కవి శ్రీ అద్దేపల్లి రామమోహనరావు, కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా

అట్టవెనుక : ప్రసిద్ధ పద్య కవి శ్రీ రసరాజు (శ్రీ రంగినేని సత్యనారాయణరాజు), తణుకు, పశ్చిమగోదావరి జిల్లా

అక్షరాలంకరణ : పి.సి. నరసింహారెడ్డి - బాపు

వెల : విడిప్రతి రూ 20-00
ప్రత్యేక సభ్యత్వం రూ 200-00
జీవిత సభ్యత్వం రూ 500-00
పోషక సభ్యత్వం రూ 1000-00

ప్రకటనలు : నాల్గవ కవరు రూ 5000 00
రెండవ కవరు రూ 3000-00
మూడవ కవరు రూ 2000-00
పూర్తి పుట రూ 1000-00

For Copies :

1. **Prof. T.V.Subba Rao**
   Department of Studies in Telugu
   Bangalore University
   Jnana Bharathi, **Bangalore - 560 056**
2. **Dr.R.V.S. Sundaram**
   Reader in Telugu
   K.I.K.S, University of Mysore
   Manasa Gangotri, **Mysore - 570 006**
3. M/s Visalandhra Book House, Hyderabad
   and all its branches

D.T.P. : DATA CRAFT
No.16, Masilamani St.,
**Madras - 17.** Ph. 434 7353

Printing : PRINTEK PRINTERS
Magadi Main Rd., Basaveswara Nagar,
**Bangalore - 79** Ph. 357763

# మనవి

'చైతన్య కవిత' కేవలం కవిత్వానికే అంకితమైన ఏకైక పత్రిక. ఇది ప్రముఖ కవుల ముఖ చిత్రాలతో ప్రతి సంవత్సరం ఆరు మాసాల కొకసారి అందంగా వెలువడుతోంది - మొదటి సంచిక వసంత ఋతువు (April) లోను, రెండవ సంచిక శరదృతువు (October) లోనూ వెలుగు చూస్తున్నాయి. 1986 నుండి ఇప్పటి వరకూ 22 సంచికలు వెలువడ్డాయి. ఇది 23వ సంచిక. ధాత నామ సంవత్సరం వసంత ఋతువులో వెలువడే ఉగాది సంచిక.

'చైతన్య కవిత'ను 1986 ఏప్రిల్ నెలలో - అక్షయ నామ సంవత్సరం ఉగాది నాడు మైసూరులో స్థాపించాం. అక్కడ 'ధ్వన్యాలోకం' అనే ప్రసిద్ధ సాహిత్య పరిశోధన కేంద్రం ఉంది. దాని డైరెక్టరు విశ్వవిఖ్యాత ఆంగ్ల విమర్శకులు ప్రా॥ సి.డి. నరసింహయ్యగారు. చైతన్య కవిత మొట్ట మొదటి సంచికను ఈ నరసింహయ్యగారి అధ్యక్షతన ఆచార్య యస్వీ జోగారావుగారు ధ్వన్యాలోకంలో ఆవిష్కరించారు.

'చైతన్య కవిత'ను త్రైమాసికగా మార్చే ప్రయత్నాలు చేశాం కాని ఫలించలేదు. (కారణాలు క్రిందటి సంచికలో వివరించాం) ఇప్పుడు యథా ప్రకారం షాణ్మాసికంగానే వెలువరించ దలచాం.

'చైతన్యన కవిత'కు ఇప్పటి వరకు 1½ లక్ష రూపాయలు ఖర్చు చేశాం. 15వ సంచిక నుండి దీనిని బెంగుళూరులో DTP + Offset లో ముద్రిస్తున్నాం. ఇప్పుడు ఒక్కొక్క సంచికకు 10 వేల రూపాయలకు పైగా ఖర్చు చేయవలసి వస్తోంది. (1995 నవంబరులో వెలువరించిన కవయిత్రుల ప్రత్యేక సంచికకు 13,120-00 రూపాయలు ఖర్చయింది). ఇలాగ కవిత్వాన్ని మాత్రమే ప్రచురించే తెలుగు పత్రిక ఆంధ్రదేశంలో కాని, ఇతర రాష్ట్రాలలో కాని ఎక్కడా లేదు. దీనిని నిలబెట్టుకోవలసిన బాధ్యత కవుల మీదా, కవిత్వాభిమానుల మీదా ఉంది. తమ అముద్రిత కవితలు పంపవలసిందిగా కవులకూ, చందాదారులు కావసిందిగా సాహిత్యాభిమానులకూ, ప్రకటనలు ఇవ్వవలసిందిగా పారిశ్రామిక వేత్తలకూ ఇందు మూలంగా విజ్ఞప్తి చేస్తున్నాం.

బెంగుళూరు — **- సంపాదకులు**

**20-3-1996 (ధాత ఉగాది)**

# అంకితం

కమనీయ కవి వతంసులూ
రమణీయ భావుకులూ
మధుర, మంజుల హృదయులూ
మానవతా మూర్తులూ
ఆంధ్ర పద్య కవితా సదస్సు అధ్యక్షులూ
అలనాటి భీమవరం కళాశాల (1952-55)లో
నా గురువర్యులూ
అయిన
**డా. నందూరి వేంకట రామకృష్ణమాచార్యుల వారి**
పాదపద్మములకు
భక్తితో...

– తంగిరాల

అమృత హృదయునకు, సంమమి
సమ సహృదయునకు, ఉదార చరితునకు, మహో
త్తమ గుణభరితునకు, క్రియా
కమనీయ దయామయునకు, కావ్యమయునకున్.

నయమార్గ సుప్రసిద్ధా
న్వయ శ్రీ నందూరి వంశ నామార్యునకున్
జయ మార్గ సుప్రసిద్ధా
హ్వయ వేంకట రామకృష్ణమాచార్యునకున్.

– కొర్లపాటి శ్రీరామమూర్తి

# నమో! నమస్తే!

ఈ సంచిక యొక్క-

ముద్రణ వ్యయాన్నంతటినీ

గొప్ప ఔదార్యంతో భరించిన

ప్రియమిత్రులు

నిగర్వి

దాన కర్ణుడు

'దళవాయి' వంశ తిలకుడు

రుక్మిణీ - కృష్ణస్వామి నాయుడు దంపతుల జ్యేష్ఠపుత్రుడు

చిత్తూరు - బెంగుళూరులో ఉన్న

శ్రీనివాసా ట్రస్టు మేనేజింగ్ ట్రస్టీ

అయిన

**శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులుగారికి**

మా నమశ్శతములు....

''నమో నమస్తే ఽస్తు సహస్ర కృత్వః

పునశ్చ భూయోఽపి నమో నమస్తే!''

- సంపాదకులు

ఎవ్వాడు 'రుక్మిణీ' -- కృష్ణమ నాయక'
పున్నెంపు పంటయౌ ముద్దు బిడ్డ!
ఎవ్వాడు 'సత్యప్రభే' శ్వరి మానస
సరసిలో విహరించు జాతిహంస
ఎవ్వాడు 'కల్ప' 'తేజేశ్వరి' 'శ్రీనివాస్'
ఘనులను గన్న బంగారు తండ్రి!
ఎవ్వాడు శ్రీ వేంకటేశ్వర స్వామికి
అంకితమైన భక్తాగ్రగణ్యు
డతడు శృంగేరి కంచి పీఠాధిపులకు
సాయి బాబాకు భక్తుడు! సన్నిహితుడు!
కీర్తికెక్కిన 'దళవాయి కృష్ణస్వా మి
**ఆదికేశవు'** లాతడు త్యాగమూర్తి !!

- తంగిరాల సుబ్బారావు



'దానకర్ణుడు'

శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులుగారు

బెంగుళూరు

# వసంత కోకిలలు

# అద్దేపల్లి కవితా వ్యక్తిత్వం

- జి. సుబ్బారావు

రాజకీయ నాయకుల పుర్రెల్ని
లోకంలోని అన్యాయాల బొమికల్ని
వ్యవస్థానిహతుల అస్థిపంజరాల్ని
వైరుధ్యాలకి చిక్కిపోయిన నరాల్ని
నీ కవిత్వపు బస్తాలోకుక్కి
నామెదడు రేవుల్లోకి ఎగుమతి చేస్తావు
ఎంతో వేదనతో ఉత్తరం రాస్తావు
సంతకం మాత్రం చెయ్యవు-

పరస్పర వైరుధ్యాలతో, అస్తిత్వంలేని రాతలతో రోజుకో రకంగా పాఠకుల బుర్రల్ని ఖరాబు చేస్తున్న కవులగురించి ఎంతో వేదన చెంది కవి రాసిన వాక్యాలివి. సమాజం పట్ల బాధ్యత కలిగిన కవి బాధ్యతా రాహిత్యాన్ని సహించలేడు. 'సంత కంలేని ఉత్తరం' అనే కవితలో శ్రీ అద్దేపల్లి రామ మోహనరావు కవి అనే వాడికి ఐడెంటిటీ ఎంత ముఖ్యమో చెప్పడం కనిపిస్తుంది. అంతే కాదు

శ్రుతి వల్లనే పాట పాటైనట్లు
సంతకంతోనే నీ రచన

అర్థాన్ని అర్థవంతం చేస్తుంది - అని చెప్పడంలో యువ కవులకు మార్గాన్ని నిర్దేశించడం కూడా కన్పిస్తుంది. అది అద్దేపల్లి ఐడెంటిటీ.

సంతకం చెయ్యడం వల్ల దొరికిపోతాననుకుంటే
అసలు ఉత్తరమే రాయకు-

ఈ మాటల్ని నిబద్ధతకు మారు పేరైనవాడు మాత్రమే రాయగలడు. మామూలు కవి చెప్పలేడు. సమాజంపట్ల ఇంత బాధ్యతతో, ఎంతో చైతన్యంతో యువ కవులను వెన్నుతట్టి నడిపిస్తున్న శ్రీ రామ మోహనరావు తొలి నాళ్లలో భావకవిత్వపు ప్రభావంతోనే తన కవితా యాత్ర ప్రారంభించారు. శ్రీ విశ్వనాథ శిష్యుడిగా ప్రాచీన కవిత్వం మీద అభిమానంతో దాన్ని ఎంతో లోతుగా అధ్యయనం చేసిన వాడాయన. ఈ రోజు వచన కవిత్వాన్ని ఒక ఉద్యమంగా, నిబద్ధతను ఒక తప్పనిసరి బాధ్యతగా ప్రబోధిస్తున్న శ్రీ అద్దేపల్లి తన తొలి కావ్యం మధుజ్వాలను

'ఉమర్' కవితకు స్వేచ్ఛానువాదంగా, అనర్గళధారతో ప్రవహించిన పద్యాల రూపంలో వెలయించారు. ఆ పద్యాలను చదువుతుంటే పద్య కవిత్వాన్ని కూడా శ్రీ రామ మోహనరావు ఎంత గొప్పగా చెప్పగలరో మన కర్థమవుతుంది.

''వనితా! ఈ జగమన్న పెద్దమదిరా పాత్రాంచలమ్మందు యౌ
వన దివ్యానుభవాసవమ్ము తెరలన్...''

అనే పద్య భాగాన్ని ఉదహరిస్తూ ముందు మాట రాసిన దాశరథి ''క్లిష్టమైన భావాన్ని ఎంతో లలితంగా వ్యక్తపరచడంతో పాటు పద్యాన్ని మనోహరంగా నడిపారు రామ మోహన రావు'' అంటూ ఎంతో మెచ్చుకున్నారు.

శ్రీ అద్దేపల్లి అభివ్యక్తి దొడ్డది.

తన్మయీభావ సమాధిలో మహోద్రేకంతో కళాసృష్టికి పూనుకోవడం ఆనాడే మనకు ఆయనలో కనిపిస్తుంది.

కవిగానేకాదు, విమర్శకుడిగా కూడా శ్రీ అద్దేపల్లి విశ్వనాథ ప్రభావంలో చాలాకాలం కొట్టుకులాడారు. ప్రాచీన ఛందోరీతుల్నీ, కవితాశిల్పాన్నీ, అలంకార శాస్త్రాన్ని అధ్యయనం చేసిన వాడు కావడంచేత, ఆ నేపథ్యంతో శ్రీ శ్రీ మహాప్రస్థానాన్ని విమర్శకు పెట్టడంతో 'రారా' వంటి మార్క్సిస్టు విమర్శకుల నుంచి తీవ్రమైన ప్రతి విమర్శల్ని ఎదుర్కోవలసి వచ్చింది. శ్రీ శ్రీ కవితా వైభవానికి తల ఒగ్గుతూనే, కొన్ని భావాల్ని వ్యతిరేకించడంలో రామ మోహనరావుగారిపై శ్రీ విశ్వనాథ ప్రభావం కనిపిస్తుంది. అయినా అందులోనూ ఎన్నో స్వతంత్ర ఆలోచనలు, ఎన్నెన్నో కొత్త విషయాలను ఆవిష్కరించడం కనిపిస్తుంది. చివరకు 'రారా'కు అద్దేపల్లికీ జరిగిన వాద వివాదాల్లో 'శ్రీ శ్రీ' అద్దేపల్లినే సమర్థించడం జరిగింది. 'మహాప్రస్థానం'పై అద్దేపల్లి వారి ''కవితాప్రస్థానం'' తొలి విమర్శన గ్రంథంగానే కాదు, అథారిటీ గ్రంథంగా కూడా నిలిచిందనడంలో ఎట్టి సందేహమూ లేదు.

''మధుజ్వాల'' నాటికి తనపై ఉన్న భావకవిత్వ ప్రభావాన్నీ ''కవితా ప్రస్థానం'' నాటికి తనపై ఉన్న విశ్వనాథ ప్రభావాన్నీ; ''అంతర్జ్వాల'' నాటికి గానీ రామ మోహన రావుగారు తొలగించుకోలేక పోయారు. సమాజంపట్ల పెరిగిన అవగాహన, హేతుబద్ధమైన ఆలోచన, సామాన్యునిపై జరుగుతున్న దోపిడీ, దౌర్జన్యాలూ, ఈ అన్యాయాలను ఎత్తిచూపించాలన్న తపన ఒక కొత్త కవిగా శ్రీ అద్దేపల్లిని ''అంతర్జ్వాల'' మన ముందు నిలబెడుతుంది. నిజానికి 'మధుజ్వాల'నాటికే కొత్త ఆలోచనలతో రూపుదిద్దుకుంటున్న ఒక కవి,' విమర్శకుడు మనకు కనిపిస్తాడు. 'మధువులోని జ్వాల' అనే ఉపోద్ఘాతంలో, చివర్లో ''ఒక

విధంగా చూస్తే ఉమర్ ఖయ్యాం జీవన వైఫల్యపు గోడకు తలకొట్టుకోగా, మధు పాన విస్మృతిలో ఆ వైఫల్యాలను మరచి పోవడానికి ప్రయత్నించినవాడు. తలకి కొట్టుకున్న ఆ గోడని పునాదులతో పడగొట్టి, అవతలి లోకాన్ని చూడాలన్న పూనిక గలవాని కన్న అతను క్రింది మెట్టులో వున్నవాడే అనాలి. ఆ పూనిక గల వానికుదాహరణ చలం''-అని ఎదుగుతున్న తన అవగాహనని చాటుకుంటారు శ్రీ అద్దేపల్లి. ఈ తపన ఆయన్ని స్తిమితంగా వుండనివ్వలేదు. నూతన కవితా సృష్టికి పురికొల్పింది. అనుభూతివాద కవిగా 'తిలక్' వింత వింత అమృతధారల్ని వర్షించిన తర్వాత, సాహిత్యంలో ఒక స్తబ్దత, కవుల్లో ఒక జడత్వం చోటు చేసుకోవడం, కొత్తకొత్త రుగ్మతలతో బాధపడుతున్న సమాజం, ఆయనలో వినూత్న ప్రకంపనల్ని కలిగించాయి. అవి కవుల మనస్సుల్లో అంతర్మథనం జరుగుతున్న రోజులు. ఈ నేపథ్యంలోంచి అవతరించింది ''అంతర్జ్వాల.'' ఇది అద్దేపల్లిలోని ఆవేదనలకు కొత్త రూపాన్నిచ్చింది.

తను స్వయంగా రాసుకున్న ముందు మాటలో- ''మనస్సు పై స్థాయినుండి అంతరాంతరాల దాకా అనంత చైతన్య కేంద్రం మానవుడు. అటువంటి అసంఖ్యాక మానవుల సమూహం సమాజం. ఈనాడు మానవుని చైతన్య పరిణామానికి గ్రహణం పట్టింది. సమాజ సమ స్థితికి అంధకారం ఉరిత్రాళ్లు పేనుతోంది. ఈ రోజుల్లో ఓ మిత్రమా! ఇంకా మనిషెక్కడున్నాడు?'' అని ఆవేదన చెందుతాడు కవి. ఈ అంతర్, బహిర్ సంక్షుభిత స్థితికి ''అంతర్జ్వాల'' అద్దం పట్టింది. ఇందు లోని 'టైటిల్' కవితలోనే

''ఇది అంతర్జ్వాల
మనిషనే అగ్గిపుల్లని
ఏ రోడ్డు మీద గీసినా, భగ్గున మండే
సమాజ బాధామయ వాతావరణం
గుండెలో రాజుకుంటున్న మహాజ్వాల...''

తన గుండెలు మండుతున్న తీరును ఆవిష్కరిస్తాడు కవి.

పుల్లగీసిన దగ్గర నుండి మంటలు ఆకాశాన్ని ఆక్రమించుకునే క్రమం ఇక్కడ మనకు సాక్షాత్కరిస్తుంది. 'భయంకర వర్తమానం' అనే మరో కవితలో

భయంకరమైన వడ్డీలతో ఉరితాడు పేని,
గొంతు చుట్టూ బిగించి రక్తంకక్కిస్తూ

సాటి మనిషి నెత్తురు బొట్లని రూపాయలుగా మార్చుకునే
దుర్మార్గులైన వడ్డీ వ్యాపారులు కక్కించిన నెత్తురు''-

అంటూ వడ్డీలతో ఉరి(తాళ్లు పేనడం, నెత్తురు బొట్లని రూపాయలుగా మార్చుకోవడం- మొదలైన వ్యవహారాలని శక్తిమంతంగా వ్యక్తీకరించడం, ఆవేదనని ఉచ్చైస్వరంలో వెళ్ల(గక్కడం ఇక్కడ కనిపిస్తుంది.

''ఓ మి(తుడా!
ఆలోచన స్తంభించి పోయి
గుండె దిమ్మెక్కి పోయి
(బతుకు బరువై పోయి
నవ్వలేను-నోరు తెరవలేను
అడుగు ముందుకెయ్యలేను'' - అనడంలో కవి యొక్క సామాజిక అవగాహనే కాక, ఈ దారుణాల్ని చూసి చెందిన ఆవేదన, తను ముందు ముందు పొందబోయే సామాజిక చైతన్యానికి స్ఫూర్తిగా పై వాక్యాలు నిలుస్తాయి. పెట్టుబడిదార్ల దోపిడి, రాజకీయ నాయకుల రాపిడిని మా(తమే వర్ణించి వదల లేదు కవి, సం(పదాయోపన్యాసాల తెరల వెనుక, నిత్య నైమిత్తిక కర్మానుష్ఠానపు ముసుగుల (కింద, ఉన్న కామం, డబ్బు, అనాథల్ని రక్షిస్తామని కంకణం కట్టుకున్న వాళ్లే ఆ కంకణాన్ని అనాథల పీకలకి బిగించడం బట్టబయలు చేస్తూ,

''స్వార్థం, కామం, డబ్బు అనే దారుణ (తిశూలంతో తాండవం చేస్తున్న ఆధునిక సంఘమనే లయకారుడి ఒంటినుండి రాలే బూడిదలోంచి, భవిష్యత్ సమాజం రూపుదిద్దుకుంటుంది.'' అని చెప్పి, ఈ కొత్తరకం దోపిడి పైనా యుద్ధం (పకటిస్తాడు కవి.

సం(పదాయ కుటుంబంలో పుట్టి, సం(పదాయ సాహిత్యాన్ని సమ(గంగా చదువుకొని, సాం(పదాయవాదుల శిష్యరికంలో పెరిగిన ఒక కవి ఇంతటి ధైర్యాన్ని (పదర్శించడం, ఇటువంటి తిరుగుబాటుని (పకటించడం సామాన్యమైన విషయం కాదు. అంత మా(తమే కాదు. '' ఓసి దేవుడూ నువ్వెంత పని చేశావే!'' అనే కవితలో

అమాయకుల అజ్ఞానం వెనుక (బతుకు పిండుతున్న కన్నీటివై
దుర్గుణాల ముఖం మీద జిలుగు మేలుముసుగువై ఎన్నాళ్లు?
మానవ మహాశక్తి లోకం మీదికి దూకుతుంటే
కొండలా అడ్డంగా నిలబడ్డ దేవుడూ! వెళ్లిపో!-

అంటూ ముప్పైయేళ్ల క్రితమే ఒక కవిత చెప్పడమంటే, అతని వ్యక్తిగత సామాజిక నేపథ్యంలోంచి ఆలోచించినప్పుడు ఆయన వ్యక్తిత్వాన్ని అభినందించక తప్పదు. సమాజంపట్ల తన బాధ్యత నెరిగిన కవి శ్రీ అద్దేపల్లి. మోసపు నినాదాలతో ప్రజల్ని మభ్యపెట్టి, ఏవేవో ఆకర్షణలతో సామాన్యుణ్ణి ప్రలోభ పెడుతున్న రాజకీయ నాయకుల ముసుగుల్ని లాగి, వాళ్ల నిజ స్వరూపాలను బట్టబయలు చెయ్యడంలో ఎప్పుడూ వెన్ను చూపలేదు. ఆయన ''ఇందిరమ్మకు భజన చెయ్యాలి'' గీతం దీనికి అక్షర సాక్ష్యం.

ఏం చెయ్యా లేంచెయ్యాలి?

నరులార మీరు ఇందిరమ్మకు భజన చెయ్యాలి - అని ప్రారంభమయ్యే ఈ గీతంలో గరీభీహఠావో, రాజ భరణాల రద్దు, బ్యాంకుల జాతీయకరణ మొదలైన నినాదాల, చర్యల డొల్లతనం బయట పెట్టడానికి వ్యంగ్య వైభవంతో కూడిన పద జాలాన్ని, మార్గాన్ని ఎంచుకున్నారు శ్రీ రామ మోహనరావు. ఆయన కలం ఉద్రేకాలను ఒక ఉరవడితో పరుగులెత్తిస్తే ఆయన గళం ఆభావాలను ఎంతో గొప్పగా ఆలపిస్తుంది. ఆ రోజుల్లో ఆ గీతాన్ని ఆలపిస్తుంటే, సభా ప్రాంగణం ఉద్రేకంతో వూగి పోతుండేది.

కేవలం సమాజ దుర్నీతుల్ని ఎండ గట్టడానికి, జరుగుతున్న దోపిడీలను చూసి వ్యధ చెంది, ఆ కంపనల్ని వ్యక్తపరచడానికే అప్పటివరకూ తన కవిత్వాన్ని పరిమితం చేసుకున్న రామ మోహన రావుగారు డెబ్భైల ప్రాంతాల కొచ్చేటప్పటికి విప్లవ సాహిత్య వీచికలతో తన భావనల్ని పరిపుష్టం చేసుకున్నారు. మార్క్సిస్టు అవగాహనతో తన ఆలోచనలకు పదును పెట్టుకున్నారు. అంతవరకూ వేదనతో జ్వలిస్తున్న ఆయన కవిత్వం, పదును తేరిన ఖడ్గంలా, అధర్మనిధనం చెయ్య సాగింది. గొప్ప ఉరవడితో, చిక్కటి సాంద్రతతో పరుగులెత్తడం ఆరంభించింది. ఆ పరిణతితో వెలయించిన కవితల సంపుటి ''రక్త సంధ్య.'' ఇందులో కవి యొక్క భావాలు కేవల ఆవేశంతో కాక, గతి తార్కిక భౌతిక వాద ఆలోచనలతో పదును తేలడం వలన కవిత్వం మరింత చేవ దేరింది. సంపూర్ణ కవితా శిల్పంతో పుటం వెయ్యబడ్డ రసగుళికలుగా ఈ కవితలు మనకు దర్శనమిస్తాయి. ఇక్కడ కవి స్థిత ప్రజ్ఞుడు. 'రక్త సంధ్య' అనే కవితలో

చరిత్ర తూర్పురాయి కాలికి తగిలి పడిపోయింది,
చర్మం చీలింది, స్పృహ తప్పింది,
నెత్తురు కాలవ గట్టింది,
అదే 'రక్త సంధ్య'.

కాలు జారిన చరిత్ర ఎర్రని మరక'' అని వర్ణిస్తారు. సూర్యుని ఉదయానికి ముందున్న సంధ్యని కాలు జారిన చరిత్ర ఎర్రని మరకగా అభివర్ణించడం ఎంతో ధ్వని పూరితంగా వున్నది.

ఒక్కొక్క ఉద్యమం కొన్ని కొత్త భావనల్ని, కొత్త కొత్త కవితా సామగ్రినీ మోసుకొస్తూ వుంటుంది. అప్పటివరకూ కవుల హృదయాల్లో కొట్టుమిట్టాడుతున్న కల్పనలకూ, వాస్తవాలకూ లంకె కుదిర్చి ఓ కొత్త రూపాన్నిచ్చింది విప్లవ కవితోద్యమం. అప్పటికి ఇరవై యేళ్లుగా సాగుతున్న వియత్నాం పోరాటాన్ని ఎంతో శక్తిమంతంగా, అద్దేపల్లి చిత్రీకరించగలగడం విప్లవ కవితోద్యమ స్ఫూర్తితోనే,

అక్కడ పసిపిల్లలు తుపాకి గొట్టంతో
పలక మీద అ-ఆ-లు రాస్తున్నారు
తల్లులు - ఎడమ చేత గన్నుతో కుడి చేత గరిటతో
పిల్లలకు ఆహారం అందిస్తున్నారు - అని మొదలై
నలువైపులా ముంచుకొచ్చే మృత్యువుకడ్డంగా
గుండెను సాచి
కారే నెత్తురులో నుండి జీవితాన్ని నిర్మిస్తున్నారు'- అని ముగించినప్పుడు అక్కడి అగ్ర రాజ్యాల విధ్వంసం, వియత్నాం ప్రజల చలించని గుండె నిబ్బరం, సంకల్పబలం మన అనుభవంలోనికొస్తుంది. కవిత్వం నినాద ప్రాయంగా మిగిలి పోతున్న సందర్భాల్లో, విప్లవానికి ఆ కవిత్వం చేస్తున్న హానిని విమర్శించడానికి ఎప్పుడూ వెనుకాడ లేదు శ్రీ రామమోహన రావు. కవిత్వానికి వస్తువెంత ప్రధానమో, శిల్పమూ అంతే ప్రధానమని తొలినించీ అభిప్రాయ పడుతున్న విమర్శకుడాయన. భీరువైన వర్గ శత్రువు పుట్టే ప్రతి పువ్వులోనూ ప్రమాదాన్ని శంకించి, అసలు పువ్వే పుట్టకుండా త్రుంచేయాలన్న ఆలోచనను తెగనాడేటప్పుడు సైతం ఆయన సంయమాన్ని కోల్పోయి, తిట్ల పురాణం లంకించుకోలేదు. అందుకు 'సెటైర్'ని సహాయం తీసుకున్నాడు.

కొత్త పువ్వు పుట్ట బోతోంది
తుపాకులు పట్టుకోండి అని ఆజ్ఞ
దాని ఊపిరి గాలి తరంగాల మీద వ్యాపిస్తోంది
చేతినడ్డం పెట్టి ఆపెయ్యమని శాసనం
కత్తితో రంగు ఒలిచేసి
ముళ్లమీద ఆరబెట్టమని ఆన - ఇలా సాగిన ఈ కవిత
పువ్వు పుట్ట బోయే చోట

అప్పుడే తెరుచుకుంటున్న రెప్పల సవ్వడికీ
వాళ్ల చేతుల్లోని తుపాకులు పట్టుదప్పి జారి పోతున్నై -

అని ముగిసినప్పుడు, ప్రతీకలుగా సాగిన ఆ వర్ణనలూ, సన్నివేశాల్ని ప్రతీకలుగా చెప్పడంలో వున్న ఆ కలంలోని బలమూ అనితర సాధ్యమనిపిస్తుంది.

ఈయన శిఖరాగ్రమెక్కి నిల్చోడు. అనవసరంగా అరవడు. ఎక్కడా నినాదాలివ్వడు. కళ్లలోకి సూటిగా చూసి మాట్లాడతాడు. గుండెకి మాత్రమే వినిపించే స్వరంలో పదాల చేత మాట్లాడిస్తాడు. నచ్చని సందర్భమొచ్చినప్పుడు, ఆయన దాన్ని వ్యక్తపరచే పద్ధతి చాలా చాలా ప్రత్యేకంగా వుంటుంది. డెబ్భై, డెబ్భై అయిదుల మధ్యలో విప్లవోద్యమాలు ఉవ్వెత్తున లేచాయి. ఎందరో విప్లవ వీరులు, తమ ఆత్మ బలి దానాలు చేశారు. సమిధలయ్యారు. ఎందరో మేధావులు, ప్రజాతంత్రవాదులు నిర్బంధాలకు గురయ్యారు. చివరకు ప్రాణాలను కోల్పోయారు. అంతటి అవసర సమయంలో కూడా నోరు మెదపని మేధావులున్నారు. అనవసర వ్యాఖ్యానాలు చేసిన వారూ వున్నారు. అట్లాంటి పడక్కుర్చీ మేధావుల్ని దిగంబర కవులు ఎంత బరి తెగించి తిట్టారో ఆంధ్ర దేశంలో కొందరికైనా తెలుసు. (డెబ్భైలకు ముందు) కానీ అటువంటి మేధావుల్ని అద్దేపల్లి సున్నితంగా విమర్శించిన తీరు సదరు మేధావుల్ని తలలు దించుకొనేట్లు చేస్తుంది. ''గదిలో మేధావులు'' అటువంటి ఓ గొప్ప కవిత.

మేధావులంతా గదిలో కూర్చుని
కవితా స్వరూపాన్ని చర్చిస్తున్నారు
సాహిత్యంలో సామాజిక స్పందన
అవసరమా? కాదా? అని - అని మొదలైన ఈ కవిత

అజ్ఞానంతో అంధకారంలో కొట్టుమిట్టాడుతున్న జనం, స్వాములు, బాబాలు, పెట్టుబడిదార్లు, పాలక పక్షం వాళ్లని దోచుకోవడం, నిరుద్యోగ సమస్య, కులకక్షలు, బలవంతుల అకృత్యాలకు బలహీనులు బలై పోవడం ఎంతో కవితాత్మకంగా వర్ణింపబడుతూ వుంటై.....

పెత్తందార్ల అడుగుల కింద
పీడితుల నెత్తురు మడుగులు
అసహాయుల అడుగడుగునా
సంక్షోభ సముద్రాలు.......అని రాస్తూ
గదిలో మేధావులు కూర్చుని

సంక్షోభం లోపలికి రాకుండా తలుపులు మూసుకుని

కవితా స్వరూపాన్ని చర్చిస్తున్నారు - అంటూ ముక్తాయింపుగా 'సాహిత్యంలో సామాజిక స్పందన అవసరమా? కాదా? అని - అంటూ పునరావృతం చేస్తూ వుంటారు. ఇది సరికొత్త టెక్నిక్. ఇందులోనే మరలా

''నవ తరాలు తెరచిన కళ్లలో రగులుతున్న పోరాటాలు

పోరాటాల సుడిగాలుల్లో గత కాలం ఎండుటాకులు- అంటూ ఇట్లా ఒక వాక్యం చివర అంతమైన పదం రెండవ వాక్యంలో మొదట్లో రావడం వంటి మరో టెక్నిక్. ఈ శిల్పం పాఠకుడికి ఊపిరాడనివ్వదు. ఇది అద్దేపల్లి శిల్ప చాతుర్యానికి ప్రబల తార్కాణం.

ఆయన రెండు సంవత్సరాలు క్రితం తెచ్చిన ''గోదావరి నా ప్రతిబింబం'' ఆయన ప్రగతిశీల ధృక్పథాన్నీ, శిల్పచాతుర్యాన్నీ ఉన్నత శిఖరాలపైకి తెచ్చిందని చెప్పవచ్చు. కవితా శిల్పం డామినేట్ చేసిందనిపించే '' గోదావరి నా ప్రతిబింబం'' కవితలో కూడా ఎంతో జీవిత వాస్తవికత, ప్రగతిశీలత కనిపిస్తాయి. గోదావరిని వర్ణిస్తూ, రక రకాల దశల్నీ, స్థితుల్నీ చెప్పడంలో ''రాత్రి అరణ్యాలకి పట్టిన అద్దంలా ఎదురొతుంది''- అనడంలోనూ,

''నీళ్ళలో తొంగి చూస్తే నా ముఖం కనిపించదు
వీరేశలింగంగారి ముఖం కనిపిస్తుంది'' - అనడం,
''జీవితాన్ని కూడా అర్థం చేసుకున్నప్పుడు
దోవ పొడుగునా పోరాటాల్ని మోసుకు పోతున్న
పరమాణు ప్రవాహంగా కనిపిస్తుంది.'' అని ముగించటంలోనూ ప్రగతిశీల ధృక్పథం ద్యోతకమవుతుంది. వస్తు, శిల్పాల సమ్మేళనానికిది గొప్ప ఉదాహరణ.

అనాథలు, అన్నార్తులు, దగాపడ్డవాళ్లు, దోపిడికి గురౌతున్న వాళ్లు - వీళ్లంతా రామమోహనరావుకి ఆత్మీయ బంధువులు. ఈయన చూపులన్నీ చీకటి మూలల్ని అన్వేషిస్తూ, ఆవిష్కరిస్తూవుంటై. అతి వాస్తవిక చిత్రం, కాలవ పక్కన కన్నీటి తోట, మరక పడ్డ కుర్రాడు - ఇలాంటి ఉదాహరణలనెన్నింటినో దీనికి తార్కాణంగా చూపించవచ్చు.

కిరసనాయిలు నదుల్లో
డబ్బు మొసళ్ళు కండలు పీక్కుతింటుంటే

కొట్టుకు పోతున్న స్త్రీ శవాలు (అతి వాస్తవిక చిత్రం),
త్రికోణాకారపు కళాయి చెడిన అద్దం ముక్క
వాళ్ల మొఖాలకి బదులు
వల్లకాటిని ప్రతిబింబిస్తూ వుంటుంది (కాలవ పక్కన కన్నీటి తోట) వాడి మొహమ్మీద ప్రజా స్వామ్య శవం వేలాడుతూ వుంటుంది.
పోస్టాఫీసు ముందు స్కూటరాగినప్పుడల్లా
వాడి కళ్ళు చిల్లరై మెరుస్తై (మరకపడ్డ కుర్రాడు)

శ్రీ రామమోహనరావు కవి, విమర్శకుడు మాత్రమే కాదు. గొప్ప ఉద్యమకారుడు కూడా. ఏ కొత్త ఉద్యమం వచ్చినా దాని ప్రగతిశీల లక్షణాలను పట్టుకొని, దానికి వెన్ను దన్నుగా నిలుస్తారాయన. యువకవుల్ని ఎక్కువగా ఆకర్షించిన మినీ కవిత్వానికి లక్షణాలను వివరించి, మెరుపుల్లా మెరుస్తున్న ఎందరో యువకవుల్ని చక్కని మార్గంలో మినీ కవితల్ని రాసేటట్లు చేశారు. దళిత ఉద్యమం ఉనికిలోనికి రావడానికి సంవత్సరం ముందే ''సాహిత్యంలో దళిత చైతన్యం'' అనే వ్యాసాన్ని ఆంధ్రా యూనివర్శిటీలో సమర్పించారు. స్త్రీ వాద సాహిత్య వికాసానికి తనవంతు కృషిని చేస్తూ, నిర్మాణాత్మక సూచనలతో అప మార్గం పట్టకుండా నిరోధించే ప్రయత్నమూ చేస్తున్నారు. దళితుల పట్ల, దళితవాదం పట్ల ఆయనకున్న అభిమానాన్ని ''సజీవదహనం'' మనకు పట్టిస్తుంది.

మంటల ప్రపంచంలోకి వెళ్లి పోతున్నాను
మిత్రులారా! సెలవివ్వండి
ఊరంతకీ అంటరాని వాణ్ణయినా
మంటకి నేనంటరాని వాణ్ణి కాదు - అని అంటుంది ఆత్మహత్య చేసుకునే పాత్ర. ఎంతో అవమానంతో ఆత్మహత్యకి పాల్పడిన అతడు

మీ కడుపులోని ఆకలితో ప్రతిఘటనను వండాలి
మీ నరాల్లోని చల్లని దారులన్నీ విద్యుత్ప్రకంపనలతో నిండాలి.

అనడంలో భవిష్యత్తుపై ఎంతో ఆశ, విశ్వాసం కనిపిస్తాయి.

''మేకల్నే బలిస్తారు'' దీనికి మరో మంచి ఉదాహరణ. బలహీనవర్గాలని పేరు పెట్టి ఓట్లు దండుకొనే పాలకవర్గాలు దళితుల్ని ఎలా మోసగిస్తున్నదీ తెలుపుతూ

మేకలన్నీ సింహాలై
యూప స్తంభాన్నూపే రోజొస్తుంది- అంటారు.

'మరణం లేని అక్షరం' అనే కవిత 'గోదావరి నా ప్రతిబింబం'లో ఆఖరిదీ మరచిపోలేనిదీనూ. 'ఉదయం' విలేఖరి రసూల్ దారుణ హత్యకిది ప్రతిస్పందన.

అక్షరానికి తను చేసిన నేరం తెలియదు
ప్రజల్ని పేల్కొల్పడం
ప్రజా శత్రువు సహించడని తెలియదు...
ఎగిరి పోయిన అక్షరం
నింగిలోంచి వెలుగు పాట వెదజల్లుతుంది
చరిత్రగా మిగిలిన అక్షరం
చరిత్రను సృష్టిస్తుంది. - అని ముగిసిన ఈ కవిత ఎంతో గొప్పది.

విమర్శకుడిగా కుందిర్తి కవితాతత్వం, విమర్శ వేదిక, సాహిత్యసమీక్ష - ఇలా ఎన్నో రచనల్ని చేసిన శ్రీ అద్దేపల్లి సహృదయ విమర్శకుడు. ఏ చిన్న మెరుపు ఏ యువ కవిలో కనిపించినా, అపురూపంగా అరచేతపట్టే, వెన్ను తట్టే సాహితీ ప్రోత్సాహకుడాయన. కవుల్ని పుట్టించలేక పోవచ్చు కాని , వారిని తీర్చిదిద్దవచ్చు. రాష్ట్ర సాంస్కృతిక సమాఖ్య అధ్యక్షుడిగా ఎన్నో వందల యువకవులకి స్ఫూర్తినిచ్చిన వాడు. క్రాంతి రచయితల సంఘం అధ్యక్షుడిగా తూర్పు గోదావరి జిల్లాలో ఆ కృషిని మరింత ముమ్మరం చేస్తున్నవాడు. కుర్ర వాళ్లలో కుర్ర వాడుగా కలిసిపోయే ఆయన్ని చూస్తే గొప్పకవి అనిపించదు, మంచి స్నేహితుడనిపిస్తుంది.

ఆయన అక్షరాలకు అన్నీ తెలుసు. అవి ఎక్కడా తడబడవు. ఎప్పుడూ అదుపులో వుంటాయి. అవి ఏ ప్రలోభాలకూ లొంగవు. రొమాంటిసిజమ్ వ్యామోహంలో కూరుకుపోవు. ఇది ఆయన విప్లవ నిబద్ధతకు, సామాజిక బాధ్యతకు నిదర్శనం. తెలుగు కవిత్వంలో ఆయన పాత్ర అవిస్మరణీయమైనది. ఆయన ముద్ర బలమైనది.

☆ ☆ ☆

## కవితా నిర్వచనం

''తన భర్త చేసిన అసమగ్ర సృష్టిని చక్కపరిచి, సమగ్రం చెయ్యటానికే సరస్వతీదేవి 'కవిత' పేరుతో ఈ లోకానికి దిగివచ్చింది''

- మల్లంపల్లి శరభయ్య

# ఆకు రాల్చిన రాగాన్ని చిగురందుకుంటుంది

- అద్దేపల్లి రామ మోహనరావు

రాలిపోయిన ఆకులన్నీ
చెట్టు కింద చేరి
గాలి మాటలు చెప్పుకుంటూ
గోల గోల చేస్తున్నై

కరిగిపోతున్న శక్తినంతా
కూడదీసుకుంటూ
కాళ్ళకడ్డం పడుతూ
లేవనే లేవనని పొగమంచు హఠంపట్టి కూర్చుంది

నిస్సిగ్గుగా నిలబడ్డ కొమ్మలన్నీ
శత్రువు కనిపిస్తే చాలు
పీకకి చుట్టేసుకుంటామని
ముందుకీ వెనక్కీ తెగ ఊగిపోతున్నై

తనని తాకిన వాళ్ళ నెత్తురు గడ్డకట్టించి
మాట్లాడకుండా మరణంలోమూట కట్టి
దిగంతాలకి విసిరి పారేస్తానని
తోట తోటంతా కోపంతో వణికి పోతోంది-

యింతలో ఏ మూలనించి గాలిని కదిలించిందో
గుండె పగులులా సన్నని కూత వినిపించింది
ఏ కొమ్మ కడుపులోని వేడిని చీల్చుకొచ్చిందో
మంట విత్తనంలా ఎర్రటి చిగురు కనిపించింది
ఏ మెత్తటి తలుపుల్ని తెరుచుకొచ్చిందో
మత్తుమందలా సువాసన ముంచుకొచ్చింది-
ఎండుటాకులు సుడిగాలిలో ఎగిరిపోయినై
మంచు తన కన్నీటిలో తనే కరిగి పోయింది
కొమ్మలన్నీ ఆకుల్ని కప్పుకుని మరుగున దాక్కున్నై
తోట తోటంతా మార్పుకి స్వాగతం చెప్తూ నిలబడి పోయింది!
ఆ మార్పు నాపగలిగే శక్తి ఆ తోటకి లేదు!

మనస్సులోని కొండలు లోయలతో సంఘర్షించి
భావాల ప్రయాణానికి ఋజువైన దారి ఏర్పడినప్పుడు
అది మనిషిలోని సహజమైన మార్పు
తన నూతిలోంచి తనని తోడుకునే తనదైన మార్పు

ఆ మార్పు నాపగలిగే శక్తి ఏ మనిషికీ లేదు
సమాజంలోని సుస్వరాలు అపస్వరాలతో సంఘర్షించి
సమతా రాగాన్ని సాధించినప్పుడు
అది సమాజంలోని సహజమైన మార్పు
తమ చరిత్ర తాము రాసుకునే ప్రజల మార్పు
ఆ మార్పు నాపగలిగే శక్తి ఏ అధికారానికీ లేదు-

అసహజ పరిణామం సమకాలీన చరిత్రకి మరో పేరు
అనుబంధాల్ని పూడ్చి పెట్టిన వల్లకాట్లో ఉంది దీని తల్లివేరు-
పురుషాహంకారపు ముళ్ళమీద
నెత్తురు బ్రతుకులీడ్చుకు పోతున్న
మహిళల దురవస్థకి కార్చిన కన్నీటితోనే
వికృత స్వేచ్ఛా లైంగిక హింసాపర సంస్కృతి హర్మ్యానికి
యిటుకలతికిస్తాడు ఒక కుహనా స్త్రీవాది-

జబ్బు చేసిన కులమతాలకి రాజకీయం మందు పోసి
లేపి నిలబెట్టి చేతుల్లో హింస వలపెట్టి
ప్రజల కన్నీళ్ళలోకి వదిలిపెట్టి
తన బంగారు మేడల్లోకి రత్నాల రాసుల్ని
తెప్పించుకుంటాడొక కపట నాయకుడు-

ప్రజా సంస్కృతికి అంకితమిచ్చానని
తెల్లని కవిత్వాన్ని లోకానికి చూపిస్తాడు
దాని నల్లని నీడల్లో ఒలికించిన మధు తరంగాల మీద
మహా భోగ నాట్యాలు చేస్తాడు ఒక ప్రజాకవిమ్మన్యుడు-
వాతావరణ కాలుష్యం కంటె
మానసిక కాలుష్యం కంటె
ప్రమాద స్థాయిని దాటి పోయింది
సిద్ధాంత కాలుష్యం!

సిద్ధాంత సముద్రాల్లో మునిగి మూలమూలల్లో వెదికితే
ఎక్కడో దొరక వచ్చు జీవితపు నత్తగుల్ల!
ఎవడు చెప్పినా బాగుంటుంది సిద్ధాంతం
ఎవడో ఒక్కడికే లొంగుతుంది జీవితం-
అసహజ పరిణామం ఈ నాటి చరిత్రకి మరో పేరు
అనుబంధాల్ని పూడ్చిపెట్టిన వల్లకాట్లో ఉంది దీని తల్లివేరు.

నేలలోని అణువణువునా నిశ్శబ్దంగా సంఘర్షించిన జీవరసం
మొక్కలోని నరాల నిండా ద్రవించి
కొమ్మల నిండా స్రవించి
ఆకుల నిండా స్పందించి
చిగుళ్ళలో ప్రాణ విస్ఫోటన జరిగినట్లు
మనిషి సమాజానికిచ్చిన సమ సంఘర్షణ
సహజ పరిణామం పొందుతుంది-
నిచ్చెన మెట్లు విరిచేసిన పాదం
ఒక్కసారి గాలిలోకి ఎగిరి నేలమీద కూలిపోతుంది
మెట్టుమీద మెట్టుగా ఎక్కిన పాదం మాత్రమే
ఉదయ సూర్యుని జలపాతంలో ఎరుపెక్కుతుంది-
రాలిపోయిన ఆకు రాల్చేసిన రాగాన్ని
కొమ్మలోంచి నాలుక బయట పెడుతున్న చిగురందుకుంటుంది
వెనుదిరిగి పోతూ
మొండి చేతులెత్తేసిన శిశిరానుభవం నుండి
గుండె తెరుచుకున్న పూలు
వసంతానుభూతుల్ని వెదజల్లుతై
అనువైన కాలం కోసం గోడ వెనక దాగి ఉన్న కోయిల
ఒక్కసారి తన పాటతో గోడని పడగొట్టి
తోటలోని ప్రతి అణువుకీ కదలడం నేర్పుతుంది
ప్రారంభమైన కదలిక పెనుగాలిగా రేగి
ఇవాళ అందరాని అమృత ఫలాన్ని,
రేపు ఆకొన్న దోసిళ్ళలోకి రాలుస్తుంది

(దూర దర్శన్ హైదరాబాదు సౌజన్యంతో)

☆ ☆ ☆

# రసభారతీయం

''కవిత్వం'' అంటే ఏమిటి? అనే ప్రశ్నకు ప్రాచీన అలంకారికులు వివిధ నిర్వచనాలు ఇచ్చారు. ''ధ్వనిరాత్మా కావ్యస్య'' అని ఆనందవర్ధనుడు అంటే ''రీతి రాత్మా కావ్యస్య'' అని వామనుడు పేర్కొన్నాడు. భోజుడు సరస్వతీ కంఠా భరణంలో

''నిర్దోషం గుణవత్ కావ్యం అలంకారైరలంకృతం
రసాన్వితం కవిః కుర్వన్ కీర్తిం ప్రీతించ విందతి''

అని నిర్ణయించాడు. కవిత్వానికి నిర్దోషత్వం-సగుణత్వం-అలంకారాలు అవసరం అని చెప్పి, అది రసాన్వితం అయిన నాడే కవికి కీర్తిప్రతిష్ఠలు తెస్తుందని నిర్ణయించాడు. సాహిత్య దర్పణ కర్త ''వాక్యం రసాత్మకం కావ్యం'' అన్నాడు. ఇంకా ఎందరు ఎన్ని విధాల పేర్కొన్నా, కవిత్వం, రస పుష్టితో ఉండాలనే ముఖ్య విషయాన్ని కవితా పతాకంగా ఉద్ఘోషిస్తూ ఉన్నారు.-

''రసహీన కవిత్వం నిర్జీవం'' అంటూ ఒక ప్రాచీన కవి:-
''రసరీతి వీతవసనా ప్రియేవశుద్ధాపివాక్ ముదే భవతి
అరసా, సాలంకృతిరపి, నరోచతే సాలభంజీవ'' అని అంటాడు.

రతి వేళ రమణి అలంకారాలు లేక పోయినా, చివరకు చీర కూడా తీసివేసినా, ఆనందాన్ని అందిస్తుంది. సరసత నెఱుగని తరుణి ఎన్ని అలంకారాలతో ఉన్నా, నిర్జీవ ప్రతిమలా లోతైన ఆనందాన్ని ఇవ్వలేదు- అంటూ రస రహిత కవితను నిరసించాడు.

''కదలేదీ కదలించేదీ ... మునుముందుకు సాగించేదీ, పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ'' కవిత్వం అన్నాడు మహాప్రస్థాన కర్త శ్రీ శ్రీ.

చదువ వచ్చు గ్రంథ సముదాయమంతయు
కృతులలోని నెఱసు లేరవచ్చు!
రసము సృష్టి చేయు ప్రజ్ఞా విశేషంబు
సాధనమున రాదు! చదువుకాదు'' అన్నాడు రసవత్కవితా స్రష్ట నవయుగ చక్రవర్తి జాషువా! కవిత, రస పుష్టితో సృష్టించాలంటే ఆ ప్రజ్ఞా విశేషం పుట్టుకతో పట్టుబడాలే కాని సాధన చేస్తే వచ్చేది కాదన్నాడు.

''మాటలు పేర్చటం కవిత్వం కాదు
కవిత్వం ఒక ఆల్కెమీ

దాని రహస్యం కవికే తెలుసు

కాళిదాసాది మహాకవులకు తెలుసు''- అంటాడు అమృతం కురిసిన రాత్రిలో కవి చంద్రుడు తిలక్.

రసవత్తరంగా, సామాజిక స్పృహతో, రస స్ఫోరక అక్షర నిక్షేపంతో- సూటిగా గుండెలకు తాకే కవితను ప్రాచీన కవితా రీతిలో అందించటంలో అందె వేసిన చేయి, రస భారతీ ఖండ కావ్యకర్త రసరాజు. కవితా రహస్యాల లోతులు తెలిసిన ఈ రసరాజు-

''వస్తువేదైన కానిమ్ము బాధ లేదు

ఆశ్రయించిన ప్రక్రియ అనవసరము!'' అంటూ రస స్ఫూర్తి లేని కవిత్వాన్ని నిరసించారు. వీరు ఛందో బద్ధ కవిత్వానికి అంకితమైనా, గేయాలు-కథలూ వ్రాసి ఔననిపించుకొన్నారు. వీరి గేయ కవిత వెండి తెర కెక్కి ''అందమైన వెన్నెలలో...'' విహరించి గౌరవ స్థానం పొందింది.

సహజంగా సరస కవిత చెప్పే ఈ కవికి బాల్యంలో తండ్రిగారు ముందుగా కంద పద్యాన్నీ, లక్షణాన్నీ చెప్పారట. ''కందాన్ని వ్రాసినవాడే కవి! పందిని కొట్టిన వాడే బంటు!'' అన్నట్లుగా కందాలతో ఆరంభించిన చాలును మహాకవి అవడంలో ఆశ్చర్యంలేదు. వీరు తమకు కవితా నిర్మాణ స్వభావం ఎప్పుడేర్పడిందో వివరిస్తూ-

గోలీలాడు వయస్సులోన నను అక్కుంజేర్చి లాలించి, కం
దాలన్ వ్రాయుట నేర్పె మజ్జనకు డానాడే కవిత్వంబుపై
హేళింగొన్నది నా మనస్సు'' అని వ్రాసుకొన్నారు.

చిన్నతనంలో అంటే 9 ఏండ్ల లోపుగా వీరు వ్రానిన కందాలు పరిశీలిస్తే పద్యం ఎత్తుకొనే ఒడుపు, రస స్ఫూర్తిగా హృద్యంగా పద్యం వ్రాసే శక్తి జన్మాంతర సంస్కారంగా వచ్చినట్లు విస్పష్టమౌతుంది. ద్రాక్షాపాకంగా సాగే వీరి ప్రతి పద్యంలోను ఉక్తి వైచిత్రి-ధ్వని-రీతి-వక్రోక్తి-అన్యాపదేశం ఏదో ఒకటి ప్రతి పదంవలోను నిక్షిప్తమై వుంటుంది. సామాజిక స్పృహ వీరి కవితా రసధునిలో అంతర్లీనంగా పొంచి వుంటుంది. పద్యాన్ని ఎత్తుకోవటంలోనే ఒక విశిష్టమైన హుందాతనం కనిపించి శ్రోతృ హృదయాల్ని తనలో లీనం చేసుకొంటుంది. యతి ప్రాసలు పద మధ్యంలో కలిసిపోతూ, ప్రతి పద సార్ధకతను సంతరించుకొంటూ, సాగే వీరి కవిత ఒక రస ప్రవాహం! వీరితో పుట్టిన కవితాభారతి; ''రసభారతి''గా రూపు దిద్దుకొని అరువది యేడు రసరాగాలు ఆలపించింది!

ఈ ఖండ కావ్య సంపుటిలో మాతాపితృ భక్తి-దైవభక్తి-దేశభక్తి-మానవతా వాదం - సామాజికస్పృహ - అభ్యుదయవాదం - అన్యాపదేశం - సందేశాత్మకత - ప్రస్ఫుటంగా గోచరిస్తాయి. భావాన్ని ప్రకటించటం కోసం పదాలు పేర్చడం కూడా కన్పించదు. భావంలో రంగరించిన పదాలు, సహజంగా దొర్లిపోతూ, ఆయా రస స్ఫూర్తిని మూర్తీభవింప జేస్తాయి. జాషువా కవితా ముద్ర వీరి పద్యా లలో గోచరిస్తుంది. ఆలోచిస్తే కొన్ని చోట్ల ''జాషువాను దాటి పోతున్నాడే!'' అని ఆశ్చర్యం కూడా కలుగుతుంది.

వీరి కవిత్వంలో మలిన శృంగార వర్ణనం కన్పించదు. జాషువా వీరికి ఆదర్శం కావటమే దీనికి కారణం.

కనిపించిన ప్రతి రాతికి మ్రొక్కి, కని, పెంచిన తల్లిని గూర్చి అంకిత పద్యా లలో

''తల్లీ! నిద్దుర లేని కన్నుల నిశీథంబెల్ల నా కోసమే
అల్లల్లాడుచు ద్వార తోరణము నీవై దారులం జూచు నీ
యెల్లల్ గీయని పిచ్చి ప్రేమయది దీపించున్ సుధా
జ్యోత్స్నమై...!''

''తల్లి తన రాక కోసం ద్వారంలో కాచుకొని ఉండేది'' అనే విషయాన్ని చెప్పటంలో ''ఆమెయే పచ్చని ద్వార తోరణంగా మారింది! తోరణంలా బిడ్డకోసం అల్లాడటం కళ్లకు కట్టేలా వ్రాశారు.

ఆ తల్లి వీరి బాల్యంలోనే కళ్లు మూసింది. ఆమె మరణించు వేళ ఏకైక పుత్రుడైన బిడ్డడు (రసరాజు) దగ్గర లేడు. తల్లి మరణాన్ని ఎంత కరుణ రస స్ఫోరకంగా వ్రాశారో చూడండి:

''కొడుకా! యంచు ప్రపంచమున్ విడచి నాకున్,మాతృ శబ్దాని కా
మడ దూరంబును చేసి పోయితివి! అమ్మా! లేదు సభ్యత్వ మీ
పుడమిన్ తల్లులు గల్గు పిల్లలను! దేవుండైన నెట్లోర్చెనో?
కడ చూపైనను దక్కలేదు కద! దుఃఖంబెట్లు చల్లారెడిన్!''

''కొడుకా!'' అని విలపిస్తూ ఆమె ప్రపంచాన్ని విడచింది! ''అమ్మ'' అనే మాటకు ఆమడ దూరంగా నేను విసరి వేయబడ్డాను! తల్లులున్న పిల్లల సంఘంలో నాకు సభ్యత్వం లేదు! ''కడ చూపైనా దక్కలేదు.'' ఇలాంటి నాబా ధను చూచి దేవుడు మాత్రం ఎలా సహించి ఉండగల్గినాడో? ఈ పద్యంలోని ప్రతి పదంలోనూ, మాతృ వియోగ వేదన కనిపిస్తోంది ఇంకా చూడండి!

''ఎపుడైన మారాము నే చేయ నందులో
గెలుపెఱుంగని పిచ్చివలపు నీది!'' కొడుకు ఎంత మారాము చేసినా, ఆమెయే ఓడి పోవటం ఆమె పుత్ర ప్రేమకు ప్రతీక!

తండ్రికి తనపై గల వాత్సల్యాన్ని వివరిస్తూ-

''అమ్మ గతింపగా సవతి యమ్మకు స్వాగతమీయకుండ-ప్రే
మమ్మున వండి వార్చి రస మాధురి తన్పుచు తల్లిలేని నా
ఉమ్మలికమ్ము తీర్చితివహో! జనకుండన నీవెకావె!''

''మా తండ్రి మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు!'' అనటంలో అందం లేదు. ''సవతి అమ్మకు స్వాగతం ఇవ్వలేదు'' అని అరచాటుగా ఉక్తి వైచిత్రిగా చెప్పారు. ఇలాంటి ఉక్తి వైచిత్రి వీరికి వెన్నతో పెట్టిన విద్య!

గుడివాడలో ఒక సాహిత్య సంస్థ వారు వీరికి ''మధుర కవి'' అని బిరుదం ఇచ్చారు. ఆ సందర్భంలో తన కవితా మార్గ దిక్సూచియైన పితృ పాదులను తల చుకొంటూ-

''నా సారస్వత జీవితమ్మునకు విన్నాణంబు కల్పించి, వి
ద్యా సౌగంధ్యము నేర్పినట్టి జనకుండానందముం బొందుచున్
భాసింపన్ దొడగెన్ మనోయవనికన్ పల్మారు నేడిట్లు నే
నీ సన్మానముఁ బొందు వేళ హృది వర్షించెన్ ప్రమోదాశ్రువుల్!''

సన్మానవేళ, కవితా గురుదేవుడు, ఈ కవి యొక్క మనోయవనికపై సాక్షాత్కరించాడట! హృదయం ఆనంద భాష్పాలు వర్షించిందట! ఇట్టి కవితా శిల్పం వీరి కవితలో ప్రతి పదంలోను భాసిస్తుంది. ''రసోపహారం''లో వీరు మాతాపితలకు కవితా నీరాజనం పట్టారు. 'అంజలి' 'అద్వైతం' 'నివేదన' అనే ఖండికల్లో వీరి దైవభక్తి కవితా రస వాహినిలో అంతర్వాహిని అయింది. ''బాటసారి''శీర్షిక క్రింద రస రేఖల్లో వ్రాసిన పద్యం వీరి ఆస్తిక్య భావానికి ప్రతిబింబం.

''నీవు కనలేదు నడచిన త్రోవనెన్ని
పాదముద్రలు పడినవో బాటసారి!
కాని కలడొక చిత్ర లేఖకుడు వాని
కుంచెకందని దృశ్య పంక్తులు హుళక్కి!'' ఇతరులెఱుగకున్న యీశ్వరుడెఱుగడా? అనే భావాన్ని ఎంత అందంగా మలచారో యీ కవి చూడండి! ఎవరి తప్పులు వారికి తెలియవు! కాని మనల్ని అందరినీ వీడియో తీసే పరమాత్మ వున్నాడు; ఆ ఫొటోగ్రాఫరునుండి తప్పించుకోలేవు- అనే హెచ్చరిక మానవుల్ని తీర్చిదిద్దే మహా వాక్యంలా వుంది!

ఒక కవి యొక్క పద్యాలు మనం వింటూంటే ఆ పద్యాలలోని ఒకటి రెండు పాదాలేనా, లేదా, అందులో భావమేనా, కవితా వైచిత్రేనా, మన మనస్సుకు పట్టాలి. అలాంటి కవిత్వం పట్టైన కవిత్వం అవుతుంది. అలాంటి పట్టు వీరి కవిత్వంలో ప్రతి పద్యంలోనూ గోచరిస్తుంది.

వీరి దేశభక్తిలో సామాజిక స్పృహ పెనవేసికొని కనిపిస్తుంది. స్వేచ్ఛా ప్రభాతం, స్వతంత్ర కేతనం, తేజోభారతం, ఆవేదన, స్వరాజ్యం, నవభారతం, భారతీయుడు, గాంధీభారతం- అనే శీర్షికల్లో భారత దేశ పరిస్థితికి ఆవేదన చెందుతూ, సామాజిక స్పృహతో వ్రాసిన ఖండికలు, ఒకే విషయంమీద వ్రాయబడినవైనా, సమకాలీన సామాజిక పరిస్థితికి అద్దంపడుతూ వైవిధ్యంతో మనోహరంగా వున్నాయి. దేశభక్తితో పాటుగా వీరికి ప్రదేశభక్తి కూడా అధికం. ''గోస్తనీ ప్రళయం'', ''ప్రళయ చిత్రం'' అనే ఖండికల్లో గోస్తనీ వరద నిమిత్తంగా చేసుకొని, తణుకును, వేయేండ్ల తణుకు చరిత్రను, తమ కవితా స్ఫూర్తితో మూర్తీభవింపచేశారు. 1986 లో గోదావరి వరద, గోస్తని మీదుగా ప్రవహించి, తణుకును ముంచి వేసింది. '' ఏమమ్మా! తగ దిట్టి దారుణము తల్లీ! గోస్తనీ! శ్రీధునీ!'' అని సంబోధించి-

''తెనుగున భారతాకృతిని తీర్చిన నన్నయభట్టు నీ జలం
బును దగ నాచమించి క్రతువుం బొనరించెను గాదె తణ్కు-తూ
ర్పున గల జమ్మి చెట్టుకడ పూర్వము! జ్ఞప్తికిఁ దెచ్చుకొమ్ము! గో
స్తని అటువంటి పావన యశస్వినికిం దగ వీ యకార్యముల్!''

అంటూ వేయేండ్ల క్రిందటి ఆదికవిని ప్రస్తావించారు. స్థానిక కవుల్నీ, దేశ భక్తుల్నీ, కళాకారుల్నీ అభివర్ణించటంలో వీరి జన్మ భూమి వాత్సల్యం ప్రస్ఫుటమౌతుంది.

దేశ సేవా పరాయణులై కీర్తి పతాకలెత్తిన అల్లూరి సీతారామరాజు - గాంధి - అమరజీవి - నెహ్రూ - శాస్త్రి - ఇందిరా గాంధి మొదలైన మహనీయుల్ని మనోహర కవితా కుసుమాలతో రసరాజు అర్చించారు. సీతారామరాజును గూర్చి

''భారత వీరనారి ముఖ పద్మముపై ఎవరామనీషి సిం

దూరము దిద్దుచున్నది?'' (అని ప్రశ్నించి) ''తెనుంగు ధరిత్రికనుంగు బిడ్డ అల్లూరి నృసింహమా!''అని పోల్చుకొనటంలోను, ''తెనుంగు ధరిత్రి కనుంగు'' అని మూడు జగణాలు దూకుతూ జై!జై! ధ్వానాలు చేశాయి! సీతారామరాజు ప్రతాపాన్ని వర్ణిస్తూ ''రవి యస్తమింపని బ్రిటీషు ప్రభుత్వము దద్దరిల్లె నీ పేరు తలంపగా''

''విశ్వ లేఖిని లిఖించెను లెమ్ము భవత్ప్రతాపముల్''

''నీరము ముట్టలేదు మరి నిద్రకు నోచుకొనంగ లేదు'' బ్రిటీషు ప్రభుత్వము అంటారు. ''నీ రక్తమం దే లావా ప్రవహించెనో?'' అంటూ అల్లూరి వీర రక్త ప్ర''భావా''న్ని పేర్కొన్నారు. భావానుగుణంగా పదజాలం వచ్చి పడటం వీరి ప్రత్యేకత.

ఈ ''అల్లూరి'' కవితలోచివర ''భాగము లేదు నీ యశము ప్రక్కన వేరొక వ్యక్తి కెన్నడున్!'' అని అంజలి ఘటించారు.

గాంధి మహాత్ముని గూర్చి యీ మధుర కవి:-

''సమత ప్రధాన సూత్రమని చాటి, ప్రజాళిని శాంతి నింపి ఖ
ఢ్గములకు నగ్గి గుండ్లకు విడాకులొసంగి పరాయి వారి స్వా
ర్థము పెకలించి, దేశము మరమ్మతు చేసి స్వయం ప్రకాశ దీ
పము వెలిగించినావు కద బాపు! ఋణంబెటు తీర్చుకొందుమో!''

సమతా సూత్రము చాటి-శాంతినింపి, విధ్వంస కాండకు విడాకులిచ్చి, స్వార్థము పెకలించి దేశము మరమ్మతు చేసి స్వతంత్ర ప్రతిపత్తి అనే జ్యోతి వెలిగించిన గాంధికి ఋణం తీర్చుకోలేమని, ఆవేదనతో ఆక్రోశించినాడు కవి! గాంధి ''పర దేశంబుల కేగియున్నను దురభ్యాసంబు లేనాడు నీ దరికిన్ వచ్చిన జాడ లేదు!'' అంటూ గాంధీ నైతిక జీవన విధానానికి నీరాజనం పట్టారు. కవిత్వాన్ని వైచిత్రితో హృదయానికి తాకేలా, వ్రాయటం వీరికే చెల్లును.

''సంతసమున జీవితమ్ము భరత క్షితి కంకితముంబొనర్చి''న నెహ్రూ ఎదపై ధరించిన ముద్దు గులాబి వీరి చేతిలో ''ముసిముసి నవ్వులు'' కురిసింది. శాస్త్రి:- ''స్వదేశ సేవలో చెఱుగని ముద్ర వేసిన విజేత'' అయినాడు. ''వీర పతాకమెత్తి భారత హృదయాల దాగిన పరాక్రమ లక్ష్మికి నాంది పల్కినాడు'' అంటారు రసరాజు.

''ఇందిరా నిర్యాణం''లో నాయనివారి ''మాతృ గీతాలను స్ఫురింప జేశారు. వీరి కవితా రసానుభూతి వేళ యే ఇతర కవితలు స్ఫురించినా, రసరాజ కవితా ముద్ర ''రాజముద్ర'' గా తెలుస్తూనే వుంటుంది! ఇందిరా గాంధిని సిద్ధార్థుని చేతిలోని రాజహంసగా భావించి యీ కవి:-

''ఆ కరాంగుళులెవరివి? ఆ కఠోర
కాల రాక్షసులెవ్వరు? కంటి పాప

చిదిమి జగమెల్ల చీకటి చేసినారు!

సహింపలేదు భారతీయ మానస సరోవరము నేడు!''

ఇందిరాగాంధిని జగత్తుకే కంటి పాపగా భావించటం, ఆ కంటి పాపను చిదిమి జగమెల్ల చీకటి చేసినారనటం అవధులు చూచిన కవితా సమాధికి నిదర్శనం! ఇంతటి భావాన్ని తేటగీతిలో గుండెలకు హత్తుకొనేలా చెప్పటం మహాకవిగా పుట్టిన ''మధురకవి'' కే చెల్లు.

కవితలో సామాజిక స్పృహ ప్రవహింపజేస్తూ, ఆరు సంక్రాంతులు - ఆరు ఉగాదులు -తొమ్మిది దీపావళులు చిత్రించారు. ఒకదానికీ మరోదానికీ పోలిక లేకుండా నవ నవ భావ స్ఫోరకంగా వ్రాయటం వీరి ప్రతిభకు నిదర్శనం. ఒకే కూర ఆరు విధాలుగా తొమ్మిది రీతులుగా వండి రసజ్ఞుల్ని మెప్పించటం అసాధ్యం. ''వండే నేర్పుల పెక్కు రీతుల రుచుల్ వర్తింపవే శాకముల్'' అన్నాడొక శతక కర్త. ఒకే వస్తువును వివిధ కోణాలలో సరసంగా సంభావించటం, సహృదయ హృదయాహ్లాదకంగా పద్యాన్ని మలచటం, వీరికే తగును. ''ఎంత చెక్కితే శిల్పం? ఎంత దిద్దితే కవిత్వం?'' అంటారు వీరు!

దీపావళిని సమాజంలోంచి సందర్శిస్తూ -

''ఎక్కడున్నవి వెలుగులు? చిక్కనైన చీకటులు తప్ప?'' అని ఆక్రోశిస్తారు. సమస్యలతో సతమతమయ్యే సగటు మనిషిని సంతప్తనరునిగా సంభావిస్తూ ''తారాజువ్వ'' ''టపాకాయ,'' ''భూచక్రం,'' ''సిసింద్రీ'' అన్నీ అంటించారు. వీరి సరస దృష్టికి అవి అందించిన అర్థాలు చూడండి!

''నేటి తారాజువ్వ, నింగి కెగయునట్టి ధరలకు నూతనార్థముగ తోచె!
నేటి టపాకాయ, కాటకమ్మున ప్రేలు బడుగు గుండెకు ప్రతిధ్వనిగ దోచె!
నేటి భూచక్రమ్ము నెత్తి చుట్టు తిరుగు బలు సమస్యలకు వ్యాఖ్యలుగ దోచె!
నేటి సిసింద్రీ అనేక వక్రములున్న బ్రతుకు బాటకు నుదాహృతిగ దోచె!
పర్వ దినమన్న మోద మెవ్వాని లోన
నేడు కన్పింపకున్నది; కూడు-నీళ్లు
దొరికినన్ చాలు కొండంత సిరియటన్న
తృప్తితో నుండె నేటి సంతప్త నరుడు!''

దీపావళిని ఎలా జరుపుకోవాలో ఈ కవి చెప్పాడు పేదలలోని నిరాశ తొలగించి వారిలో ఆశాజ్యోతిని వెల్గించటం కంటె దేవతార్చనం లేదు! అంటూ -

''మట్టి ప్రమిదల కళ్లలో మసలుచున్న
ఒక నిరాశాంధకారమ్ము నుత్తరించి

దివ్వె వెలిగించు ప్రేమైక దృష్టి కంటె
దేవతార్చన మేది పృథ్వీ తలాన?''

మట్టి ప్రమిదల కళ్లు పేదల నిరాశా పూరిత నేత్రాలను స్ఫురింప జేస్తాయి! ఈ కవి, కన్ను తెరచిందిగా, ఎన్నో సంక్రాంతులు చూచారు. ఈ సంక్రాంతులు కాంతివంతంగా కన్పించ లేదు! సమాజ కాంతే సంక్రాంతిగా, నవ్య జీవన సంక్రాంతి నవ్వుకోవటం చూడాలని వీరి ఆకాంక్ష! ''బంతిపూలు'' ''రంగవల్లులు'' ''పొంగలి'' ''బొమ్మల కొలువులు'' అనువానిలోని అందాలు, బ్రతుకు బాటకు దూరంగా ఉండటం వల్ల సంక్రాంతి, ''జీవన సంక్రాంతి'' గా కన్పించటం లేదు వీరికి!

''బంతి పూవులకున్న పసుపు పచ్చని వన్నె జీవితాలందు రాజిల్లునాడు!
రంగవల్లులలోని రమణీయమగు శోభ జీవితాలందు భాసించునాడు!
పొంగలిలోగల్గు పొంగారు మధురిమల్ జీవితాలందు వర్షించునాడు!
బొమ్మల కొలువులో పొంగారు వేడుక జీవితాలందు వాసించునాడు!
ప్రత్యణువు పర్వరాజమై పరిఢవిల్లు
ప్రతి దినము పౌష్యమాసమై పరవశించు
హృదయ వీథిలో దివ్వియలెత్తినాడు
నవ్య జీవన సంక్రాంతి నవ్వుకొనును!'' అన్నారీ కవి!

ఉగాదిని వర్ణిస్తూ సమాజాన్ని సందర్శిస్తూ-

''అడుగు పడుట లేదు! అన్ని మార్గాలలో
కంటకాలు బుట్టకాయ లెత్తై
ఎచట గ్రుచ్చుకొనునో ఎక్కడ రక్తమ్ము
చిమ్ముమనో, విధాత చెప్పలేడు!''

ప్రాచీన ఛందో మార్గంలో ఇంతటి సామాజిక స్పృహతో పురాణ పర్వ దినాల్ని వర్ణించిన కవిని ఇతః పూర్వం చదవలేదు! మరొకర్ని చూస్తాననే నమ్మకం లేదు!...శుక్ల వత్సరాదికి శుభాకాంక్ష లందిస్తూ-

''చమురు లేనట్టి దివ్వెతో జాతి నేడు
కృష్ణ పక్షమ్ములో పయనించు చుండె!
శుక్లవత్సరాది! శుభమస్తు! విజయోస్తు!
శుక్ల పక్షము వెలయించి శోభనిమ్ము!''

జీవితాలకు వెలుగిచ్చే నిధుల కొఱతలో, కష్టాల మధ్య నికృష్ట ప్రయాణం సాగిస్తున్న సామాజిక స్థితిని, తెలియ జేస్తూ, శుక్ల పక్షమే వెలయించమని ఉగాదిని కోరారు వీరు.

మతమే ఒక మత్తైతే, మతమే మారణ హోమం అయితే, మతం గితం వద్దంటారీ కవి. మతం సమతా గవాక్షాలు తెరవాలని వీరి ఆకాంక్ష.

''మతములేవైన గాని సమాన దృష్టి
నిలిపినప్పుడె మనిషి ''మనీషి'' యగును!
మతము ముసుగున రక్తపు మరకలున్న
మానవుడు కాడతడు పచ్చి దానవుండు!''- అని ఆవేశంతో నివే

దించారు. పెక్కు సందర్భాల్లో సర్వమత సమాన భావంలేని మతమౌఢ్యాన్ని వీరు దుయ్య బట్టారు.

''మతము మతము కాదు మర్కటమ్ము!'' మతాలు శాంతి కేతనాలు ఎత్తగ ల్గాలి. మతాలు సమైక్యతా పచ్చతోరణాలు కట్టాలి. ఆనాడే నవ్య ఉగాదికి ఆరంభం అవుతుందంటూ ఈ కవి ప్రమోద ఉగాది వేళ-

''మనిషి మనీషియైనపు, డమావసిలో గల జీవితాలు కాం
తిని దరిసించి అభ్యుదయ దీపికలెత్తి మనోజ్ఞ శాంతి కే
తనములు నిల్పినప్పుడు, మతాలు సమైక్యత నేర్పి పచ్చతో
రణములు కట్టినప్పుడు, ధరాస్థలికా దినమే ఉగాదియౌ!- అన్నారు.

మరో సందర్భంలో మానవత్వానికి మసి పూసే మతాలు వద్దంటూ-

''సహన ముద్ర చెరిపి స్వార్థ దృష్టి నిలిపి
మానవత్వమునకు మసిని పూసి
నరుని కాటు వేసి నరకమ్ము సృష్టించు
మతములేల పెక్కు మాటలేల?''

అని మతోన్మాదుల్ని నిలదీసి ప్రశ్నిస్తారీ కవి!

కవితలో ఉండవలసిన తురీయ లక్షణం ''ఉపదేశం''. ఉపదేశయుక్కుగా ఉండాలి కావ్యం. ఉపదేశాన్ని అన్యాపదేశంగా అందించటంలో వీరికి వీరే సాటి. ''వెలుగుపూలు''ఖండికలో- చీకటి (అజ్ఞానం)లో ఉండ వద్దంటూ, పొద్దుతి రుగుడుపూవు కాంతికోసం ఎలా ఎదురు చూస్తోందో, గమనించమంటాడు. కోడిని చూచి వెలుగును(జ్ఞానాన్ని) ఆహ్వానించటం నేర్చుకోమంటాడు.

''కొదమ చీకట్లలో నుండి గొంతు నెత్తి
కొక్కొరొకో యటంచు వెల్గును దలంచి
స్వాగతము పల్కు కుక్కుట స్వామి నరసి
మనికి నిక్కైన సరిదిద్దు కొనుము లెమ్ము'' అని ప్రబోధిస్తాడు!

ఇకనైనా బ్రతుకును మార్చుకోమంటాడు! ''విలువగల కాలమాగదు! వెలుగుపూలు నింపుకొనుమోయి నీ సెజ్జనిండ నేడె!'' అని హెచ్చరిస్తాడు! ఉన్నత స్థాయిని అందుకొన్న వారికి అనుకూల పరిస్థితులున్నా యనుకోవటం అపోహ! పరిస్థితులు అనుకూలింపక పోయినా ఉన్నత లక్ష్యాన్ని సాధించిన వాడే ''ఋషి''- ''మహా పురుషుడు'' అని వీరి నిర్ణయం. కృషి చేస్తే మనుషులు ఋషులౌతారని, మహా పురుషులు కూడ కాగలరని వీరి నమ్మకం. కోకిల - మిణుగురు పురుగు - అబ్జసుందరి - గొంగళి పురుగు - క్రొవ్వొత్తి అనే అయిదూ వీరికి ఆదర్శ మూర్తులు - ప్రేమైక మూర్తులు! ఈ విషయాన్ని వీరు ''ఆత్మీయము'' అనే శీర్షికలో చిత్రీకరించారు.

''ఒగరు చిగురులు తినుచు మహోన్నతముగ
పంచమమ్మున రాగ సంపద వెలార్చి
రస జగానికి శ్రవణ పర్వము నొసంగు
కోకిల స్వామి నాకు ప్రేమైక మూర్తి!'' అంటూ ''పంచమ

స్వరంతో శ్రవణ పర్వం చేసే కోకిల తినేవి ఒగరు చిగురులు!'' అనే సత్యాన్ని వివరించారు. ఒగరు తింటూ, జగానికి రాగ సంపదను అందిండటం అనే విశేషం వెల్లడించారు. ప్రసూన రాజమైన పద్మం, సౌందర్య సౌరభాలతో ప్రపంచ ప్రసిద్ధం! కాని దాని పుట్టుక బురదలో- ఈ సత్యాన్ని

''బురదలో పుట్టినను ప్రభాకరుని వెలుగు
సోకినంతనె విప్పారి సురభిళించి
ప్రభుని పాదాలు ముద్దిడి పరవశించు
అబ్జసుందరి నాకు ప్రేమైక మూర్తి'' అంటూ కోకిలను,

పద్మాన్నీ తమ ఆత్మీయులుగా పేర్కొన్నారు. తాను చీకటిలో ఉండి ఎత్తుకు ఎగురుతూ వెలుగు రేఖలు చిమ్మే మిణుగురు-; అందరి నిరాదరణకూ గురై, యోగ సమాధిలో ఉండి, సీతాకోక చిలుకగా మారిన గొంగళి పురుగు-; లోకానికి వెలుగు అందించాలనే ఆకాంక్షతో నిలువునా కరగిపోతూ, వెలుగు అందించే క్రొవ్వొత్తీ తమకు ఆత్మీయులన్నారు. ఇందులో కవి జీవితం ప్రతిఫలించింది.

''బాధలు లేకుండా జీవితాలుండవు''. బాధలతో క్రుంగి పోకుండా, నవ్వుతూ బ్రతుకుతూ, ఆశావాదిగా జీవించిన వాళ్లు ఔన్నత్యాన్ని అందుకొంటారు. ''జీవన్ భద్రాణిపశ్యతి'' అనే సందేశాన్ని ''జీవన గీత''లో ప్రబోధించారు. జీవన గీత ఒక భగవద్గీత!... ఒక భవిష్యద్గీత!

''బ్రతుకు బాటలో కంటకాలను దలంచి
మడమ త్రిప్పుట ధీరుని మతము కాదు!
పొంచి నిలచిన కంటకమ్ములకు నడుమ
శీర్షమెత్తు ''గులాబి''దే జీవితమ్ము!'' అంటారు. చుట్టూ బాధలున్నా, తలపైకెత్తి నవ్వగల్గిన వాడి కంటె మహా జ్ఞాని వుండడు! బాధలకు క్రుంగిపోతూ, నిరాశలో పడి నాశనం కావద్దు! ఆశావాదిగా జీవించమంటూ, మరో పద్యంలో ఆశాజ్యోతిని వెలిగించారు!

''బ్రతుకు చీకటి రాత్రిలో వాడెననుచు
దిగులు చెంది నిరాశతో తిరుగ వలదు!
నల్లని అమాస విడిన అనంతరమున
ఆకసమునందు నెలవంక అవతరించు!''

బ్రతుకు ఎంతటి భారమైనా నిరాశ పడవద్దు! కష్టాలు(అమావాస్య) శాశ్వతం కాదు! శశిరేఖ అవతరించి వెలుగు నిస్తుంది - అని బాధాసర్పదష్టులకు ప్రబోధం అందించారు.

కట్టుబాటు తప్పి, శ్రుతి తప్పిన పాటగా సాగే కాలాన్ని చూడలేక కవి పొందిన ఆవేదన ''వక్రించిన వర్తమానం''లో గోచరిస్తుంది.

''తరతమ భేదముల్ విడచి, ధర్మువు పోవిడి, తల్లిదండ్రులున్
గురువులు పెద్దలన్న సరకుం గొనకుండగ దుష్పథమ్మునన్
పరుగిడుచున్న కాలమిది! పచ్చని తోటల కొండ ముచ్చు నా
గరికత కుప్పిగంతులిడి గౌరవమందుచు నుండె నేడహో!'' - అని వాపోయారు. ''ప్రాణము నిల్పు ఔషధములన్ కలితీ యొనరించు నట్టి విజ్ఞానము బారచాచిన విషణ్ణదినా''లను చూచి, విషాదాన్ని పొందారు. అన్యాపదేశంగా నీచ స్వభావుల్ని ''దీపోత్సవం''లో ''ఉష్ట్రపక్షి-గ్రుడ్లగూబ-శలభం-గబ్బిలాయి'' అనే పేర్లతో నిరసించారు.

''ఏదియొ అపూర్వ మధుర రక్తి స్ఫురియించుగాని
అర్థమ్ముకాని భావగీతమ్ములవి!'' అన్నట్లుగా ప్రచారంలో ఉన్న భావ కవిత్వ పద్ధతిలో ''ప్రతీక్షణం'' అనే ఖండిక వ్రాశారు. ఊహా ప్రేయసి అందెల రవళిలో కలిసి పోతానంటాడీ అద్వైతవాది!

''రమ్ము సఖియ నీ అందెల రవళిలోన
కలసి పోయెద! రసిక శోకాల నరసి

చిమ్మ చీకట్లు నీళ్లాడు క్షితికి నీవు

ఒక నిమేషము రమ్మ విద్యుల్లతాంగి!'' అంటూ ఆహ్వానించాడు. అంద రాని పొందుగా అందంగా, ప్రతీక్షణంగానే, మిగిలి పోయిందంటాడు.

''పవలు రేలును ఎవరినో పలుకరించు

బుడుత సెలయేళ్ల నుడి నాకు బోధ పడక

పాద పద్మాలు తడుపుచు వచ్చితివని

సకియ! మోసపోతిని ప్రతీక్షణవము మిగిలె'' అన్నారు. ఈ ప్రతీ క్షణం-ఎదియొ అపూర్వ రక్తి స్ఫురింప జేస్తూ మనోజ్ఞంగా వుంది.

కవితా సమాధిలో సత్కవికి అందని అంశాలుండవు

''అతి చతుర కవేః సృష్టి రప్యుజ్జితోర్వీ

ప్రాప్యవ్యోమ్నాంతరాళం పునరపి సహసా

విందతే పూర్వమూర్వీం!'' చతుర కవి సృష్టి, భూపరిధి దాటి నభో వీథిలో విహరిస్తుంది. అంతలోనే తన అనుభూతిని అందించటానికి ధరిత్రిని చేరు కొంటుంది. కవి, తాను అనుభూతిని సాధించకుండా లోకానికి అందించగల్గింది ఏమీ వుండదు.

''జీవితంలో లేనిది కాగితంలోకి వస్తుందా?

తునుక మబ్బు లేకుండా చినుకు నేల పడుతుందా?'' అంటాడు శేషేంద్ర కవిచంద్రుడు! ''రసానుభూతి'' లో రసరాజు

''ప్రణయ సఖితోడ వెన్నెల రాత్రులందు

ఇసుక తిన్నెల పైన ప్రేమైక గీతు

లాలపించుచు జంటగా అడుగులిడుట

ఎంతటి రసానుభూతి? వర్ణింపతరమె?'' ప్రణయసఖి-వెన్నెల రాత్రి-ఇసుక తిన్నెలు-ప్రేమ గీతాలాపనతో జంటగా నడచుటలోని రసానుభూతి మన ఊహకు అందించారు.

''కోమలంబగు పచ్చిక కూరుచుండి

గలగలా పారు సెలయేటి జలములోన

అడుగులట్టిటు కదలించి తడుపు నపుడు

కలుగు అనుభూతి కెచట వ్యాఖ్యలు లభించు?''

రాత్రింబవళ్లు ఎవరినో పలుకరిస్తూ గలగలా పారే సెలయేరు! ఆ యేటి యొడ్డున కోమలమైన పచ్చిక (లాన్)! ఆ పచ్చిక మీద కూర్చుండి సెలయేటిలో అడుగులు కదలించటంలోని అనుభూతికి వ్యాఖ్యలు లభించవట! అది కవితల కందని భావంగా పేర్కొన్నారు.

శీతోష్ణ-సుఖ దుఃఖ-జయాపజయ-లాభాలాభ-ద్వంద్వాలకి అతీత స్థితిలో సమత్వ స్థితిలో బ్రతకటం అనేది దీపావళీ దీపాన్నీ,వత్తినీ చూచి నేర్చుకోమంటాడీ కవి!

''ఆముదము గ్రోలుచున్నను; ఆవునేయి
త్రావుచున్నను-ప్రమిదలో ప్రత్తి వత్తి
వెలుగు జెండాల నెత్తి జీవించ గలదు!
ఆ మహా ధర్మమునకు నే నంజలింతు!'' - కష్టాలలో ఉన్నా, సుఖాలలో వున్నా, ఒకే విధమైన స్థితిలో ఆనంద బ్రహ్మోపాసనతో జీవించు! నీ అనుభూతి ఒకే విధంగా వ్యక్తం కావాలి! ఈ మహా ధర్మాన్ని మట్టి ప్రమిదలో ఉన్న వత్తిని చూచి అలవరచుకోమంటాడు. వత్తికి ఆవు నెయ్యి లభించినా ఆముదం లభించినా వెలుగురు ఒకే విధంగా అందిస్తోంది. వ్యక్తి కూడా వత్తి ఎత్తుకు ఎదగాలంటారు రసరాజు!

కవితా వైవిధ్యంలో తన కవితా శిల్పాన్ని అనల్పంగా చూపించే శ్రీ రసరాజు గారిని అన్ని పత్రికలూ అభిమానిస్తున్నాయి! ఆకాశవాణి కవి సమ్మేళనాలకు ఇతర కవితా ప్రసారాలకు ఆహ్వానిస్తోంది! సినిమా రంగంలో వీరి గేయ కవితా కన్య, అందంగా ''అందమైన వెన్నెలలో'' విహరిస్తూ ఉత్తమ సినీ గేయ రచయితగా ''కళాసాగర్'' అవార్డు అందించింది వీరికి. ఆంధ్ర దేశంలో అనేక సన్మానాలు పొందారు. మధుర కవి అనిపించుకొన్నారు. దీనంతకీ కారణం ''స్వామి అనుగ్రహం!'' అంటారు. ''నేను, నా ప్రతిభ!'' అని ఎన్నడూ అనుకోరు! అనరు! తన యీనాటి స్థితికి ''నీ దయా భిక్షే కారణం'' అంటూ నివేదనలో-

''ఏను ఫలమైన మధరిమ నీవయగుదు!
సౌరభము నీవ యేని ప్రసవము నగుదు
నేను!! నీ దయా భిక్ష లేదేని నాకు
కలదె యీ విశిష్టత? ప్రభూ! కలదె బ్రతుకు?''

నేను ఫలాన్ని అయితే నాలోని ''మాధుర్యం'' నీవే! నేను ప్రసూనాన్నయితే నాలోని ''సౌరభం'' నువ్వే తండ్రీ! నీ దయ లేకపోతే నాకీ విశిష్టత ఈ గుర్తింపు

ఎలా వస్తాయి ప్రభూ! అంటూ అహంకార రాహిత్యంగా పరమాత్మకు నివేదించు కొన్న సన్నివేశం వీరిని కవితా శిఖరమే కాదు, జ్ఞాన శిఖరం కూడా ఎక్కించింది!

ఈ కవి ''జిల్లెడు పువ్వు''తో ఆత్మీయతానుభూతిని పొందారు! తనకు ప్రతి నిధిగా జిల్లేడు పువ్వును సంభావించారు.''లేదు మోదమనుకొన్న తన గత జీవితాన్ని గుర్తుకు తెచ్చుకొంటూ; కవీశ్వరులు, కవితాప్రియులు నెత్తిని పెట్టుకొంటున్న యీనాటి స్థితిని చూచుకొంటూ '' ఏ యదృష్టమో? ఏ పూర్వ పుణ్యమో!'' అని మోద భాష్పాలతో ఆ పరమాత్మకు అంజలి ఘటించారు.

''ధూళిని కప్పుకొంచు ఒక దోషిగ ప్రక్కల నిల్చి దీన గా
థాలయ కావ్య వస్తు పరమాశ్రయనై పడియున్నదాన! ని
ద్రాళువునై ప్రగాఢ తిమిరంబున కంకితమైనదాన! ఈ
వేళ నుషోదయ ప్రథిత వీథుల నిల్చితి నే యదృష్టమో!''

ఈ జిల్లెడు పువ్వు పద్యాలు చదువుతోంటే ''దీని వెనుక ఏదో ధ్వని స్తోంది!'' అని అనిపిస్తుంది. ''ప్రతీయమానం పునరన్య దేవ వస్త్వస్తి వాణీషు మహాకవీనాం'' (మహాకవుల వాక్కుల వెనుక మరొక వస్తువు ధ్వనించును). ఆ వెనుక నీడగా నిలచి కవి జీవితానుభవం, ప్రతీయమానం అవుతుంది. ''పూవుల జాబితాలో కెక్కని జిల్లేడు పువ్వుకు, శివార్చనా భాగ్యం లభించినట్లుగా, అల్పజ్ఞుడ నైన నాకు, గుర్తింపు పొందిన కవిగా, గౌరవ భాగ్యం లభించింది'' అనే విషయాన్ని ధ్వనింప జేస్తూ వినయాన్ని ప్రకటించాడు ఈ కవి! సినిమాలు-రేడియోలు-సన్మాన సభలు-కవి సమ్మేళనాలు తనను బహు ముఖంగా ఆహ్వానిస్తోంటే జిల్లేడు పువ్వులో నిలచి

''శివుని శిరాన నన్ను అభిషేక మొనర్పగ వచ్చినావె క్రొం
బువులను త్రోసి; యెంతటి యపూర్వ చరిత్రము! దీన గాథలో
చివికిన యట్టి నన్ను నొక జిల్లెడు పువ్వును స్వీకరించు నీ
ప్రవిమల చిత్త వృత్తికి సలా మొనరించెద నర్చక ప్రభూ!'' అని

అంటారు. ఈ ఖండికలో ''బ్రతికి యుండిన శుభములు బడయ వచ్చు'' అనే ఆశావాదంతో పాటు స్వీయ జీవితం ధ్వనించింది! ''జిల్లేడు పువ్వు'' ఒక ధ్వని కావ్యం!

''ప్రళయ చిత్రం'' అనే ఖండికలో ప్రకృతి వైపరీత్యాలను పేర్కొంటూ ఈకవి

''ప్రకృతి రచియించు ప్రళయ చిత్రంబులోన
ఎన్ని రంగులు కలవొ ఊహింప లేము!'' అంటారు.

''ఆలోచనామృత''మైన రస భారతి ఖండ కావ్యంలో నా ఆలోచనకు అందిన వానిలో కొన్నింటిని మాత్రం చూప గల్గాను. అన్నీ వివరిస్తే ఒక మహా వ్యాఖ్యానం అవుతుంది! రస భారతీ కావ్యాన్ని ఆమూలాగ్రంగా చదివిన సహృదయులు ఈ నా సమీక్షను ''కొండను అద్దంలో చూపించాడు!'' అనుకొంటారు. నా నేర్చిన భంగి చెప్పాను. రస భారతీ కావ్యాన్ని ఆమూలాగ్రంగా చదివి రసరాజు పద్య విద్యకు ఎంతగా ప్రాణం పోశారో, అర్థం చేసికోగలరనీ, ఈ నా సమీక్షలోని వాస్తవాన్ని గుర్తి స్తారనీ ఆశిస్తూ మధుర కవిని ఆశీర్వదిస్తున్నాను.

చ॥ ఒక పద్యమ్మున నందచందముల నెన్నో చూపి, సాహిత్య భా
వుకతా మాధురి కేత మెత్తి, కవితా ప్రోత్సాహివై - సత్కథా
నికలున్, గేయములల్లి ఆంధ్ర శుభవాణీ కంఠహారాలుగా
సకలాంధ్రావని మెచ్చు నిచ్చు రసరాజా! నీకు దీర్ఘాయువౌ!

టి.వి.కె. సోమయాజులు
రిటైర్డ్ లెక్చరర్.

నన్నయ భట్టారక పీఠం
తణుకు

☆ ☆ ☆

## రసప్రవక్త

ఏ విషయంబు నిచ్చినసరే! శిఖరాలకుఁబ్రాకి, క్రొత్త నె
త్తావులఁ గుమ్మరించి, సరదా పరదాలను దీసి, శ్రోతృ క
ర్ణావయువాలు రంజిలఁగ నామెతలిచ్చు రసప్రవక్త! మా
టి.వి.కె. సోమయాజులు గడించిన కీర్తికి నంజలించెదన్!

- రసరాజు

# దేవదానవ తత్త్వములు

## (కథానిక)

- గాడేపల్లి కుక్కుటేశ్వర రావు

అమృత లబ్ధి కొఱకు నమరులు నసురులు
క్షీర సాగరమును జిలికినపుడు
పొడమి నట్టి యమృతమును జగన్మోహిని
దేవ పక్షమునకె త్రావఁబోసె. 1

అమృతము దక్కనట్టి యసురావళి రుద్రు సమాశ్రయించి మా
నము, క్రుధ, రోషమీర్ష్యలు పెనంగొన నిట్లనె ''దేవ దేవ! మో
సము జరిగెన్ జనార్దనుఁడు చక్కని చుక్క విధాన వచ్చి దు
ర్భ్రమలకుఁ బాలు చేసి మము, పంచె సమస్త సుధన్ సురాళికిన్ 2

అతఁడు మీకుఁ జుట్టమై పోయె నెదిరించి
యందమన్న మాకు ననువుగాదు
ఆతఁడిచ్చకొలఁది యాడించుచున్నాఁడు
ఆడుచుంటి మేము ననదలగుచు.'' 3

ఆ పలుకుల్ మహేశ్వరు హృదంతర మందొక ముల్లుగళ్ళయై
రేప, రమాధి నాథుఁడొనరించిన మాయ గ్రహించి తీవ్రమౌ
కోపము వచ్చి ''రం డసురకుంజరులార! వికుంఠధాము నా
క్షేపణ వెట్టి తత్సుధను జీలిచి మీకును బంచఁ జేసెదన్'' 4

అని రుద్రుం డుగ్రుండై
దనుజులఁ దనవెంటఁగొని యదాటున వైకుం
ఠ నగరి పై వెడలిన, వా
రిని గని నారాయణుండు ప్రియమెసలారన్. 5

వచ్చిన వారి కెల్ల సదుపాయములన్ విడిదిండ్లఁ దిండ్ల లే
యచ్చర పూవుఁ బోండ్ల మధురాసవముల్ గల గిండ్లఁ బండ్ల బల్
మచ్చిక నంచ రెక్కల నమర్చిన పాన్పులఁబట్టు దిండ్ల గో
ర్వెచ్చని నెత్తుటంబళుల వే సమకూరిచి పల్కె శూలితో. 6

''తమ రాక చేత వైకుం
ఠము నేఁడు కృతార్థమయ్యె నాచే నే య
ర్థము గోరి యిందఱీ చం
దమునన్ దయ చేసిరో గదా!'' యన హరుఁడుం 7

''నీ యతి వినయమ్ములు న
న్యాయములిఁకఁ జాలు నేల యమృతము సమతం
బోయవు దైత్యుల? కెవరని
నీయూహ! మదీయ భక్త నివహము వీరల్. 8

క్షీర జలధిఁద్రచ్చుచో రేగి వచ్చిన
హాల హలము మ్రింగునపుడు నేను!
అమృత రసమదెల్ల నారగింపను మీరు
చెల్లవింక నిట్టి చేష్టితములు. 9

ఇప్పుడె యిక్కడికే సుధఁ
దెప్పింపుము! సురలతోడ దితిజుల నెల్లం
దప్పక త్రాగింపుము! ని
న్నప్పుడె సమదృష్టియనుచు నభినందింతుం'' 10

అని రుద్రుండు నింద వెట్టిన విష్ణుండు, 11

''అమృతముదెండు పొండని భటావళిఁ గొందఱఁబంచి, యట్టులే
యమరులఁ దోడి తెండనుచు నంపెను కొందఱ, వారు వీరు శీ
ఘ్రమ కొని తెచ్చిరా పిదపఁ గంజ దళాక్షుఁడు తన్నివాస సౌ
ధమునఁ గలట్టి మంటప పథంబును రెండుగఁ జీల్చి నడ్మగం 12

తెఱఁగట్టించెను, దైత్యులొక్కదెస నాదిత్యవ్రజం బొక్క ది
క్కరహిం బ్రాహ్మణ భోజనావసర పంక్తుల్ దోఁపఁ గూర్చుండి రా
హరి బంగారపుఁ బాన పాత్ర లొగినయ్యై వారి ముందుంచి ''యె
ల్లరకుంబోసెద నీ సుధం, విని మదాలాపంబు క్రోలందగుం. 13

అని వెనువెంట నిట్లని చెప్పందొడంగె 14

''పోసిన యమృతము పాత్రము
గా సాపడఁ జూతురేని గ్రక్కున విషమై

వే సంహరించుఁ, ద్రావం
జేసన్న యొనర్తు నపుడు చేకొనుఁడు సుధన్'' 15

దానికంగీకరించె దైత్యవ్రజంబు
దేవబృందంబు లంత మంత్రించి విష్ణుఁ
డిరు తెఱంగుల వారి ముందరఁ గలట్టి
పాన పాత్రల నమృత ద్రవంబు పోసె. 16

పోసి యొక్క చమత్కృతి సంకల్పించి 17

త్రావుండని చేసన్న మ
హా విష్ణుండొసఁగె, వేగ నటు దైత్యు లిటుల్
దేవతలు సుధాపాత్రల
వావిరి గ్రహియించి త్రావఁ బైకెత్తునెడన్ 18

చేతులు లేవవు, బద్దల
చేతన్ బిగియించినట్లు చిత్రముగా మో
చేతుల కీళులు వంగవు
ప్రీతి సుధం గ్రోలఁ గడఁగి వెతవడి రసురల్. 19

చక్షని మండె నద్దనుజ జాతికి ''వెండియు వెన్నుఁడింతలో
వెక్కులఁజేసి మమ్ము నొక వేడుకఁ జూచుచునుండె; చేతులన్
బిక్కబిగించునే! యిటకుఁబిల్వఁడు! తేల్పఁడు! వాని రక్తముల్
జుక్షెద మేమి గాఁగఁ దలఁచున్ దితి సంతతియన్న నింతకున్'' 20

అనుచు మిను ముట్టు క్రోధం
బున రక్కసు లెల్లరొక్క మొగి నరచుడు వెం
టనె వచ్చి విష్ణు విట్ల నె
దనుజులతో శాంత వచన తత్పర బుద్ధిన్. 21

''మీకే కాదదె నిర్జర ప్రతతికిన్ మీలాగె మో చేతి క
ట్టాకల్పించితిఁగాని వారిదినుట లేదా? రండు చూపింతు''నం
చా కంజాక్షుఁడు మధ్యనున్న తెఱఁ దీయంబంచెఁ గన్పించె ది
వ్యాకారుల్ సుర లా సుధన్ గొనెడి దృశ్యం బద్భుతాపాదియై. 22

ముడువఁగ వంగని కరముల
ముడువం దలపెట్ట కొకరి మూతికి నొక ర
య్యెడఁ బాత్ర లంది యిచ్చుచుఁ
గుడుచుచు నున్నారు దేవకోటు లమృతమున్. 23

దిగ్భ్రాంతి చెందె నేతా
దృగ్భాజ దుపాయమునకు మృడుఁ, డటుదైత్యుల్
వాగ్విస్పష్టులైరి, హరి స
మ్యగ్భాత్ప్రీతి నప్పుడనె శంకరుతోన్. 24

''చూచితె దైత్యదేవ మనసుల్! దితి సంతతి స్వార్థమైన యా
లోచనఁ దాము తామఁదిన లోఁదలపోయఁ బరోపకార కా
ర్యాచరణమ్ముచే నమరులవ్వలి వారికిఁ బెట్టి రెన్నఁగా
నీచము స్వార్థ మున్నతము నిత్యపరోపకృతి క్రియాగతుల్. 25

ఇతరులకు సాయపడి యెడు
మతి గలుగుట దేవగుణము, మహి స్వార్థ మన
స్కృత దైత్య గుణము, నరుఁడు
నృతుఁడగు దేవుఁడగుఁ బరజన హితాచరణన్.'' 26

(నా ''ఆనందవల్లి'' కావ్యమునుండి)

☆ ☆ ☆

## పుష్పకాంక్ష

కానుకనై ధరాధిపుల కాళ్ళ కడం బొరలాడి వాడిపో
లేను, ధరాపరాగ పటలీ మలినమ్మగు ద్వార తోరణా
స్థానము నం దురింబడగ జాలను, దోసిటి పేరి ఘోర కా
రానరకమ్మునం దుసురు రాల్పగలేను నిమేష రక్తినై!

(- వేదుల)

# అంచులు దాటి

- జి. గోపాలయ్య

నిద్ర లేచాననుకొని లేవబోతానా
కనురెప్పలు సమ్మె విరమించ లేదని
ప్రకటించేస్తాయి.
పిట్టగా మారిన కలొకటి
గూడు వెతుక్కొంటుంది
కిటికీ తెరలు ఒత్తిలిగించి
ముంగిట చెట్టొకటి చిలుక గొంతుతో
పిలుస్తొంటుంది.
శరీరమంతా కిరణాల ముళ్ళు దింపేసుకొని
తేలిగ్గా ఆవలించేస్తాను.
కమ్మని సువాసనొకటి తన కాఫీ బలంతో
రెప్పల తాళం విప్పేసొనంటుంది.
ముట్టుకోగానే ముందు తలుపులు
వార్తల గంపొకటి ముంగిట కాసేసినట్లు
గుసగుసలాడేస్తాయ్.
నిస్సహాయతను వెలుగు సాక్షిగా వంచించడానికి
మండల కొలిమిలో అక్షరాలు అందంగా సాగదీసినట్లు
ఎదురుగా కనిపిస్తుంది.
మారాంజేస్తున్న కొమ్మల్ని బుజ్జగించి
ముందు కడుగేస్తుంటే
కందిన మనస్సును తెల్లబరిచేస్తుంది
మల్లె తీగొకటి-
బతుకు మీద మలామేస్తున్న భయాలన్ని
అక్కడొకటి అక్కడొకటి ఆకులై
రాలుతుంటాయి.
వెనుక పిలిచేవారు లేరని కాదు
ముందు చూడాలనుకునేవారు లేరని

అపుడే రాలనున్న పండొకటి
జాలి పడ్తుంది.
శ్రమ శరీరాల నమ్మకాలు స్వేద బిందువులై
ఆకుల మొనలనుండి రాలటం
కనిపిస్తుంది.
అలవాటు పదాల అరిగిన రికార్డుల్లో
సుగమ సంగీతం వెతకడం
పల్కరింపుల వలస పక్షుల రాకకై
చక్రమై దొర్లడం
ముక్కలై ఆకులు రాల్చిన నీడల్ని
ఒక్కటిగా అతికే ప్రయత్నమేనని
తెలిసి పోతుంది
పరుగు పందెంలో నా వెనుకెవరూ లేకుండా
జాగ్రత్త పడ్డాను.
పంచుకోవలసినది పండు వెన్నెల జేసి
రాత్రినై కరిగాను.
మొక్కలు మహా వృక్షాలుగ నా కంటిలోనే
ఎదుగ నిచ్చాను
చేతులు కంచెను చేసిన రోజుల
వయోపరిమితి నెంచ లేదు
నేల వాలిన దానిని పైకెత్తడానికే
నా నీతను ఎడారి పాల్జేసిన వాణ్ణి
ఏ చెట్టు నీడల హక్కు భుక్తుల కోసం
నే నిపుడు పోరాడాలి?
చీకటి చీర గట్టిన నేల తల్లి
తన ఒడిని చాపుతోంది.
ఈ యింటిని మమకారమై అల్లుకోడానికేమో
నా ఆత్మతీగ నిక్కడే పాతేసుకున్నాను..

☆ ☆ ☆

# జీవనది

- రాజేశ్వరీ దివాకర్ల

నాన్నమ్మ కళ్ళల్లో ఔదార్యం తప్ప,
పేదరికాన్నెపుడూ కనుగొన లేదు.
నిండు ముత్తైదువులా
నూరేళ్ళూ బతికినన్నాళ్ళూ,
ఆమె అంతరంగ మేమిటో
ఎవరికీ అంతుబట్ట లేదు.
రిటైరయిన తాతయ్య
ఇంటికి తిరిగి తెచ్చిన
పూలదండను
చిరునవ్వు మంచుతో
తగిపిందే తప్ప
రెప్పల క్రింద బరువుతో
వసివాడనీ లేదు
తాతయ్య జీతపు రాళ్ళతో
పొయి రాజేసి
ఎసట్లో పోసిన బియ్యం
వచ్చి పోయే వారికి
వడ్డించిన విస్తరయేవి.
ఆమెకు సలాడ్, సూపూ
ఇన్స్టెంట్ పుడ్లూ
తెలియక పోయినా
ఆమె రాచ్చిప్ప వంటకం
ఘుమఘుమ ఇంటిల్లి పాదికీ
వంటబట్టేది.
ఆమె పురిటి నొప్పులూ
బలెంత పథ్యాలూ
ఆశు కవిత్వంలా అనుభవించిందే తప్ప
ప్రతీకవాదంలా కొరుకుడు పడలేదు.

ఆమె కూతుళ్ళను భారమనుకోక
బాధ్యతలను నేర్పింది
కొడుకులను వరాలనుకోక
కష్టసుఖాలను పంచింది
ఆమెకున్న నాల్గు చీరలూ
రంగుమాయక
క్రమబద్ధమైన ఛందంలా
ఒంటికి అతుక్కు పోయేవే తప్ప
విచ్చల విడి వచనంలా
వెలిసిపోయేవి కావు.
కుటుంబం కొండ చరియల్లో
ఆమె ఒరుసుకుని ప్రవహించింది
తనలోని పిల్ల కాల్వలను
ఉమ్మడిగా విస్తరించి
జీవనది వలె
గంభీరమయ్యింది.

☆ ☆ ☆

## అల్లసాని పెద్దన కవిత్వం

మలయానిలానికి రేగిన మల్లెల పుప్పొడీ
ఆ పుప్పొడితో చిక్కబడిన వెన్నెలా
ఆ వెన్నెలతో విచ్చిన కలువతేనె
ఆ తేనెతో మత్తెక్కిన తుమ్మెద పాటా
ఆ రీతి తుమ్మెద పాటతో కట్టలు త్రెంచుకొని పారే
విరహిణి యేడుపూ
ఇవీ-
పెద్దన కవిత్వానికి మూల ద్రవ్యాలు!

- మల్లంపల్లి శరభయ్య

# గొంతుకు మేకప్

- యెనిశెట్టి శ్రీరంగ నాయకి

గొంతు వాకిట ముందు నిలచిన మైక్రోఫోను
నాకు ప్రతిసారీ
వామనవతారంలోని విష్ణుమూర్తిని
తలపుకు తెస్తుంది.
అక్కడ కూర్చోగానే,
శుక్రాచార్యుని ముందు కూర్చున్న
ఉచ్చారణదక్షుడైన
కచుడిలా మారి పోతాను.
ఆ గుడి గదిలో
నాతో పాటూ నల్లడిస్కులూ
మీట నొక్కగానే మాట్లాడే టేపులూ,
ఆలిండియా అధికారి నుండి అబ్బూరి వరకు
ఆలుచిప్పల్లో ఆణిముత్యాల్లా,
గూటిలోని గువ్వల్లా
నేను పిలిచేవరకు
నిశ్శబ్దంగా నిద్రిస్తుంటారు.
అక్కడ అందరం
గొంతులకు అక్షరాల ఆభరణాలు వేసుకుంటాము
మాటల ముఖాలకు మేకప్ చేస్తుంటాం.
ముఖానికి పౌడరు అద్దడం మరచినా,
డిస్క్ ముఖాలకు మాత్రం
మెత్తని గుడ్డతో మరింత మెత్తగా తుడుస్తాము.
రికార్డింగ్ చేయాలనుకున్నప్పుడు
రింగులతో కదిలే కుర్చీలో కూర్చుని
C.T.R. 1 పైన ఒక చేతిని
C.T.R. 2 పైన మరొక చేతిని వుంచి
చేతులను రెక్కల్లా కదిల్చే విహంగాలమవుతాము

కన్సోల్ ముందు కూర్చున్నది మొదలు
మా కథను కంచికి పంపేవరకు,
మైకు తెరమీద, కదిలే గొంతులమవుతాము.
ఒక్కోసారి
తొట్రుపడి తప్పు చదవగానే
ఎందుకు?
అని అడిగిన యక్షుని ప్రశ్నకు
జవాబు చెప్పలేని ధర్మజుని సోదరుల మౌతాము.
నా ఎదురుగా
సెకన్ల సుందరీమణులు
ఎర్ర వస్త్రాలు ధరించి
అద్దం మేడలో సద్దు లేకుండా
ఆడుతూ ...ఆగుతూ
నా గుండెలో గాభరా గమనిస్తుంటారు.
ఆ పైన వుండే
రెడ్‌లైట్ ఒంటి కంటి రాక్షసుడు
అప్పుడప్పుడూ, హైదరాబాద్, ఢిల్లీలకు వెళ్తుంటాడు.
వాడు
మార్కాపురం వచ్చినప్పుడల్లా
నన్ను వణికిస్తుంటాడు.
మా గొంతు వినగానే
శ్రోతల చెవులు కళ్ళై విచ్చుకుంటాయి
అందుకే మేము
మా గొంతులోని స్వరామృతాన్ని గ్రోలాలని
కోరే శ్రోతలను తప్ప మరేమీ కోరని వాళ్ళం.
ప్రశంసల చాక్లెట్‌లను
చప్పరించే చిన్న పిల్లలం.
విమర్శల ఉత్తరాలను
గులాబీ గుత్తుల్లా
అందుకునే ఆడ పిల్లలం.
గద్య సంగీతాన్ని గానం చేసే గంధర్వులం

శబ్దాశ్వాలకు, యంత్ర రథాలకు
సయోధ్యను సాధించే
స్టేషన్ డైరక్టరు అనుచరులం.
ప్రతి నిత్యం పలుకరించే
మాటల పన్నీరు చిలుకరించే
అకాశవాణి అనౌన్సర్లం
కనపడకుండా వినిపించే శ్రవ్యనటులం
అదృశ్య రూప శ్రవ్య నటులం.

☆ ☆ ☆

## కవిత్రయం

నన్నయ: ''నన్నయ మాటల చుట్టూ వెన్నెల కాస్తూ ఉంటుంది.
ఆయన రాత్రివలె ఆప్యాయమైన కవి.
వాల్మీకిది వలె ఈయనదీ స్త్రీ ప్రకృతియే!''

తిక్కన: ''తిక్కన్న పట్టపగటి వంటివాడు. ఈయన శిల్పం
చతురస్ర శోభితంగా ఉంటుంది. సూక్ష్మాతిసూక్ష్మమైన రేఖలు
కూడా విస్పష్టంగా ఉంటాయి. పురుష ప్రకృతి.''

ఎఱ్ఱన: ''ఎఱ్ఱన ఇటు పగలుగానో, అటు రాత్రిగానో కరిగిపోయే
స్వభావం గల సంధ్యారాగం వంటి కవి! ఈయనలో
దివా నిశా లక్షణాలు సమపాళంగా ఉంటాయి. ఈయన
అసలు స్వరూపం వ్రేపల్లెలోని కీలారాలలోనే వెదకి
పట్టుకోవాలి''

- మల్లంపల్లి శరభయ్య

(కీలారాలు = పసుల మందలు)

# చిత్తమా!

- కారుపల్లి రాజారాం

శ్రీ రమణీ కళత్రు వరచిత్ర విచిత్ర జగత్పవిత్రు శృం
గార సమగ్ర గాత్రు బహు కర్మవిమోచన సచ్చరిత్రు శ్రీ
సారస లోచనామల విశాల కృపామయ లోక రక్షకున్
శ్రీ రఘు రామచంద్రు నిక శీఘ్రమె ప్రార్థన సల్పు చిత్తమా! 1

ఈశ్వరు చిద్విలాస పరమేశ్వర భాస్వర సత్ప్రకాశకుᳲ
శాశ్వత రూపదీపక విశాల జగద్రచనా విశాలులో
కేశ్వరు సాధు పక్ష విమలేక్షణ దుర్జన గర్వనాళు స
ర్వేశ్వరు నాకృపామయుని విష్ణుని ధ్యానము సల్పు చిత్తమా! 2

శ్రీ గిరిజా మనోహర విచిత్ర విలాస శశాంక శేఖరుᳲ
భోగి విభూషి దేవ ముని పూజిత సర్వశుభ ప్రదాయకుᳲ
యోగి హృదంతరంగ నిలయోన్నత తత్వరహస్య బోధకుᳲ
శ్రీ గురునాథుᳲ శివుని శీఘ్రమె ధ్యానము సల్పు చిత్తమా! 3

ఓ గిరిజా మనోరమణ! యో ప్రమథాధిప! యో త్రిలోచనా!
యో గజచర్మధారి శివ! యో త్రిపురాంతక చంద్రశేఖరా!
నాగ విభూషణా! నిరత నంది గణాది సుసేవితా హరా!
వేగమె బ్రోవు మింకనని వీడక ధ్యానము సల్పు చిత్తమా! 4

ఓ కమలా మనోరమణ యో మధుసూదన యో జనార్దనా!
యో కమనీయ చేలధర యోపురుషోత్తమ నీవెదిక్కు, రా
వే కరుణించి నోముగదవే యని నెమ్మది పద్మ నాభు నా
గోకుల వంశవర్ధనుని గోరిక భక్తి భజించు చిత్తమా! 5

శంకరుడీవె సజ్జనవశంకరుడీవె జగద్విధాత యో
పంకజభవ్యుడై వెలుగు బ్రహ్మవు నీవె చరాత్మ నీ
కింకరులౌ మహాత్ముల కికెందుకు వాద విభేదమంచు ని
శ్శంకగ నమ్మి శ్రీహరిని సంస్మరియింపు ముదార చిత్తమా! 6

నల్లని దేహకాంతి గల నందకుమారుని ధర్మవత్సలున్
పుల్ల సరోజలోచనుని పూర్ణ విరాజిత నొప్పువానినిఁ
చల్లని చూపులఁ వెలయు చక్కని చంద్ర కళావిలాసు శ్రీ
వల్లభు శౌరి నామమును వాంఛిత భక్తి భజించు చిత్తమా! 7

ఎవ్వని కోరి భక్త జనులెప్పుడు తాపసవృత్తి పొందిరో
యెవ్వడు లోకమంతటను నెల్లెడ వాడియు స్వీయమాయచే
యెవ్వడు లీలలఁ సలిపి నేలుచు నీక్షణ చేయుచుండునో
యవ్వసుదేవనందనుని హర్షముతోడ నుతించు చిత్తమా! 8

ఈశ్వర దేవదేవ జగదీశ్వర నిత్యనిరంజనాకృతీ
శాశ్వత ధర్మరక్షక నిశాచర భంజన సత్యరూప విశ్వే
శ్వరు భక్తిలోల పరమేశ్వరు నిత్య నిరంజనాత్మునిఁ
విశ్వమయాంతరంగ వర వేదవిలాసు భజించు చిత్తమా! 9

మంత్రము లెన్ని నేర్చినను మానస మందలి భ్రాంతి వీడునా!
యంత్రము లెన్ని గూర్చినను యాగము యజ్ఞములెన్నిజేసినఁ
తంత్రము లెన్ని సల్పినను ధన్యతగల్గునె? సర్వమూలనీ
మంత్రమె చాలు నాకనుచు మాధవసేవ లొనర్చు చిత్తమా! 10

☆ ☆ ☆

## పింగళి సూరన

''చెఱకు తోటలతో
పండి ఒరిగిన వరిచేలతో
పోకలకు ప్రాకించిన తములపాకు తీగలతో
అరటి తోటలతో
సమశీతోష్ణమైన శరత్కాలము!''

– మల్లంపల్లి శరభయ్య

# ఒక వేకువ

- వి.ఆర్. విద్యార్థి

విశ్వప్రాసాదపు
తూర్పు దిగంత ద్వారాలు తెరుచుకుని
మంచుకొండల మెట్లు దిగివస్తూ ఉషస్సు -

భువనపటలానికి వ్రేలాడే
నక్షత్ర దీపాలు ఒక్కొక్కటే మలుగుతుంటే
నీలిమలీనుతూ ఆకాశం -

రాత్రంతా తమ
అలల గుప్పిట్లో దాచుకున్న మబ్బుల్ని
కుందేళ్ళనీ, జింకల్నీ, పులుల్నీ, నక్కల్నీ చేసి
గగనతలంలోకి ఊదేస్తూ సముద్రాలు -

పక్షుల గొంతుల్ని అరువు తీసుకుని
చిత్రమైన భంగిమల్లో, వినూత్నమైన రాగాల్లో
ఆడుతూ, పాడుతూ అరణ్యాలు -

ఈ వేకువలో
చిగురులేత ఉషః కిరణ తంతులతో
నాజూకుగా నేసిన వెచ్చని శాలువా కప్పుకుని
పచ్చిక బయళ్ళ మీద పరుచుకున్న
తుషార మౌక్తికాల మీద నడిచి వెడుతూ
చలన ప్రపంచంలోకి నువ్వు.



# 4 + 1 = 4

- కొప్పర్తి

పారశీకం వాడప్పుడెప్పుడో
సింధు ను హిందూ గా ఉచ్చరించాడు
సింధు కివతలున్న ప్రజల్ని హిందువులన్నాడు
ఐదు నదుల సింధూ దేశంలో నాలుగే ప్రవహించడం వాస్తవం
వాటిల్లో ఒకటి సూర్యుడికి అర్ఘ్యమైంది
ఒకటి నెత్తురై ప్రవహించింది
ఒక దాని మీద సరుకుల ఓడలు లంగరెత్తాయి
మరొకటి చెమట కాల్వగా బీడుల్ని మాగాణుల్ని చేసింది
ఇంకిపోయిన ఐదోదిప్పుడు
ఊటలు ఊటలుగా ఉబికి యేరై పరవళ్ళు తొక్కుతోంది

ఇప్పుడా ఐదూ సంగమించి
మహా ప్రవాహం కావడం ఒక చారిత్రక అవసరం

ఎప్పుడూ ఒక్కడే దొంగగా సాగిన
నాలుగు స్తంభాలాట
ముగించడమే కాదు
ఆటలు కట్టిపెట్టి
అసలు దొంగెవరో ఆచూకీ తీయాలి
విభేదం ఎవరితో ననేది తేల్చుకుని
ఆవేశాల్ని మిగిల్చుకుని
యుద్ధరంగాలకు మోసుకుపోవాలి
అన్నిటి కంటె ముందు

నాలుగు ప్లస్ ఒకటి ఈజ్ ఈక్వల్ టు ఒకటి
లెక్కను సాధించాలి

పంచ పాండవులంటే
మంచం కోళ్ళలాగ ముగ్గురూ అంటూ
రెండు వేళ్ళు చూపించి
నల్ల బల్ల మీద ఒకటి వేసిన పంతుల్ది
తెలివి తక్కువతనం కాదు.



## నది పుట్టిన గొంతుక

నేను అస్పృశ్యుణ్ణి
నా ఒళ్లంతా మట్టివాసన
నా బ్రతుకునిండా వెట్టి వేదన
నా కళ్ళనిండా ఎండ వేడిమి
ఎండకు ఎండి వానకు తడిసి
బిగుసుకుపోయిన
మఱ్ఱి ఊడల్లా నా తల
నాకై కవిత లేదు
నాకు చరిత లేదు
నాలుగు వేదాలలోంచి
నాలుగు పాదాల లోంచి
నన్ను తొలగించారు.
కట్టెలోంచి జారిన కట్టెలా
ఒక్కణ్ణే ఎక్కడో ఎండిపోయాను.

- బొజ్జా తారకం

# హృదయ చిత్రం

- 'ఎలనాగ'

దర్బారీ కానడను ఒంటినిండా కప్పుకుని వచ్చి
ఉస్తాద్ బడే గులామలీఖాన్ గొంతు
నా ఇంటి గుమ్మానికానుకుని నిలబడింది!
వ్యాకులత్వపు పాముకాటుకు గురై
మధుపాత్ర నాశ్రయించబోయిన మనస్సుకు
ఊరటనిచ్చి వెళ్లింది

☆ ☆ ☆

ఇంగ్రేస్ కుంచెకు పూసిన 'లా సోర్స్' కళాబిందువు
సింధువై, నా చక్షు గవాక్షాల్లోంచి దూసుకుపోయి
రెటీనా మీద ఇంకి, మెదడులో తేలి
నరనరాల్లో నవానుభూతిగా ప్రవహించింది

☆ ☆ ☆

వెతల పీడ (నం) అధికమై
చిట్లిపోబోయిన నా హృదయానికీ, రక్తనాళాలకూ
పిల్ల తెమ్మెరలాంటి చల్లని కవిత్వాన్ని మోసుకొచ్చిన
టాగోర్ గీత మాలిక తన రాకతో ఉపశమనాన్నిచ్చింది

☆ ☆ ☆

తృప్తిని కావిలించుకుని
ఆనందోత్సాహాల 'పొందు'తో వున్న క్షణాన
దైన్యమూ దరిద్రమూ అనూదితమై
అవతరించిన ఆర్తగీతంలా
ఒక బీర (బాధ) ఎదురై
నా హృదయానికి తగిలింది
కొరడాలా, కత్తి మొనలా!



# ఎడారి నిండా నీళ్ళు

- అడిగోపుల వెంకటరత్నమ్

ఇక్కడ ఎడారి నిండా నీళ్ళు
ఎక్కడా మొక్క మొలవడంలేదు
అకృత్యాల పట్టిక ఇదిగో....
ప్రతివాడూ వాడిది కాని నీడను
వెంటేసుకుని నడుస్తూ
శుష్కించిన వొంటి చర్మాలకు
వాసాలై నిల్చిన ఎముకల గూళ్ళు
నగ్న రూపాలన్నీ వస్త్రాపహరణాలు కావు
అన్నీ వస్త్రాలు లేనివే!
రోజువారీ విస్ఫోటనాల కొలమానానికి
రోజా యంత్రాల్ని కనుగొనాల్సి వుంది
సంపదల్ని మోసుకుపోయే బాట
సమస్తాన్నీ శాసించే మాట మధ్య
అచేతనాల గట్టలై పడున్న అక్షరాలు
ఒక పదం....
ఒక వాక్యం....
ఒక సందేశం....
ఒక ఉద్యమంగా మారి
జనపదాలను కూడగడతాయి!
ఒకవైపు పడగెత్తిన సంపద
ఒకవైపు చెయ్యెత్తిన సమూహం మధ్య
దివారాత్రాలు సాగే బాటలో
మిణుగురు శిశువుల వెలుతురు
శిశువుల్ని మింగుతూ చీకటి!
ఉప్పొంగిన చీకటి మాటున నూతిలో గొంతుకలు
కొండంత చీకట్ని తరుముతూ

గోరంత దీపం!
ఎండిన వత్తి పుష్పిస్తుంది
ఎక్కడ దాగింది ఇంధనం?



# అద్వైతం

- గిడుగు రాజేశ్వరరావు

కీచురాళ్ళను కాపలా పెట్టుకుని
రేయంతా జాగరణం చేస్తుంది
అనుక్షణం భయంతో
అదిరి పడుతూనే ఉంటుంది
గుప్పిట్లో శత్రువు చిక్కిందన్న భ్రమతో
కునుకైనా ఎరగదు చీకటి
ఉక్కు పిడికిలి బిగించినా
ఉషోదయాన్ని ఆపగలదా?
వ్రేళ్ళ సందుల్లోంచి జారి
వెల్లువై ఉప్పొంగుతుంది.
గట్టునీ పుట్టనీ కనపడ్డ ప్రతి వస్తువునీ
కడిగి మరీ మలామా చేస్తుంది
అంధకారానికింక అస్తిత్వం ఎక్కడ?
తన్ను తానే గుర్తుపట్టలేనట్టు
తళతళా మెరసి పడుతుంది
ఈ రసాయన క్రియనే కాబోలు
విజ్ఞులంటారు అద్వైతమని!



# అవస్థ

- బులుసు వేంకటేశ్వర్లు

నే ననెడి యూహ లోజాపులోన నిలుపు
కొనగ లిప్త లిప్తకు ప్రాణమును స్వరూప
మునను కదలించి త్రోయుముందునకు - నాకు
ప్రియముగా నట్టి మార్గాన వెలికి వచ్చి -

ఈ తనూస్సృష్టి యీ సృష్టి లోతెఱుగక
చేతనా లేలిహానంపు స్థితులెఱుగక
జ్వలన కిరణ పయఃపాన పథము ద్రొక్కి
వశమునై కన్ను తెఱచి విభ్రాంతమైతి!!

సరస మధురోహలకు గాఢ శర్వరీ స
మాగతాంధ్యమ్ము లారతులై - విభిన్న
సూక్ష్మరాగమ్ములను త్రోవ చూచుకొంచు
సంప్రవృద్ధ ప్రవృద్ధమై సాగెయాత్ర -

అనుభవ స్వరూపమ్ము తనంతతాను
భిన్న భిన్న వర్ణమ్ములై పెరిగి విఱిగి
సర్వ పరిణామ దశలందు సంశయమ్మై
జీవనాలంబనముగ భాసించుచుండె -

కొనలలో పర్వు లెత్తు సంక్షుభిత రేఖ
సూత్ర బద్ధమ్ముగాఁ జేయుచుండె బ్రతుకు
తళతళలుపోయి వెలిసిన కలల బరువు
మోయుచున్నది నిర్వేల మోహ నౌక!!

నే ననెడి యూహ లోజాపు లోన నిలిచి
యున్నదో లేదో! మూలమ్ము నుండి కదలు
నా స్వరూపమ్ము నా కనంతముగ తోచు
మఱల నెన్నడో! యెక్కడో!!....



# ఉదయాస్తమయాలు

- ఎస్జీడి. చంద్రశేఖర్

పడమటి కొండల్లో
అస్తమిస్తున్న సూర్యుడు
హత్య చేయబడ్డట్టు
ఆకాశం నిండా నెత్తురు

తూర్పు కనుమల్లో
ఉదయిస్తున్న చంద్రుడు
శాంతి చేస్తున్నట్లు
ఆకాశం నిండా వెన్నెల వెలుగు



నేను బ్రద్దలవుతున్న అగ్ని పర్వతాన్ని
నన్నెవ్వరూ ఆర్పలేరు
నావి అగ్ని పాదాలు
నా కాళ్లను ఏ తాళ్లూ కట్టి పడెయ్యలేవు
నా శిరస్సు సగర్వ పతాక
నన్నెవ్వరూ అవనతం చెయ్యలేరు.
................
ఇవాళ నాది అగ్నిముఖం
నా చేతులు వజ్రాయుధాలు
నేనిప్పుడు నడిచే ఖడ్గాన్ని
నన్నెవ్వరూ తాకలేరు

- ఎండ్లూరి సుధాకర్



# ''ది ఈడిపస్ లవ్''

- పాత మత్తిగిరి సుబ్రహ్మణ్యం

అమృత స్నానం చేయించి
అనుభూతి పూర్తి కాకుండానే చీకట్లో
ప్రక్క కొరిగిన ఆకారాన్ని అక్కసుతో చూస్తుంది
ఆమె అతడికి భార్య!
ఆ అసంతృప్తి నిశీధిని పోరాటాల మధ్య
ఆమె దేహాన్ని అహల్యం కానివ్వకుండా
అసంకల్పితంగా అతడి ఓ నిర్బలకణం
ఆమె దేహం సొచ్చినప్పుడు
ప్రకృతి తనకిచ్చిన రాక్షస బలంతో
తన దేహాన్ని ఆ కణంపై అచ్ఛాదించి
అతడిని మళ్ళీ అవతరింప జేస్తుంది
ఆమె అతడికి అమ్మ!
అతడు ఆమెలో మిగిల్చిన
అసంతృప్తి అగ్ని జ్వాలా ఝరిని
ఆమె కన్నుల కాంక్షల కన్నీటి కాసారాన్ని
ఎదపై ఉప్పొంగే క్షీర సముద్రాల్ని
ఏక మొత్తంగా కుడిచి పెరిగి మీసాలు దువ్వుకుంటూ
వీథుల్లో పడి బలాదూరు తిరిగే
తన ఫ్యూడల్ శిశువుపై
ఈగ వాలనివ్వకుండా
వేయి కళ్ళతో పహరా కాస్తుంది
అకారణంగానో, సకారణంగానో
తన శిశువులో తండ్రిపై ద్వేష భావం పెంచుతుంది
తన కొడుక్కి తనే సర్వస్వమౌతుంది
తనలో బైఠాయించిన అసంతృప్తి భూతం
ఆకలితో నాలుక సాచినప్పుడు
కొడుకుగా చెట్టంత ఎదిగిన అతడి విశాల వక్షాన్ని

కండపట్టి మెలి తిరిగిన దేహాన్ని
చెదరిన కళ్ళతో చూస్తుంది. ఓ క్షణం
మరుక్షణంలో
యుగాల పునరావృతంలో ఋషిత్వం పొందిన
ఆమె అనుశ్రుత రక్తం విజృంభించి
ఆమె మనోభవ వైతరణిలో వికటాట్టహాసం చేసే
రాక్షసుణ్ణి మట్టుపెడుతుంది
ఎంతో దయతో, ఎంతో వాత్సల్యంతో
అతణ్ణి మళ్ళీ క్షమించి
బాల్యంలో
తన ఫ్యూడల్ శిశువు ఆడుకునే పూలతోటవుతుంది
యౌవనంలో
అతడు చేసుకునే సమష్టి వ్యవసాయానికి
మట్టిగా మారి, ఆడ మనిషిగా మారి
అతడు దున్నుకోవడానికి క్షేత్రమౌతుంది.



## శ్రీనాథుడు

''అందరి హృదయాలలోనికీ ప్రియాతిథి వలె సరాసరి ప్రవేశించే ఒకే ఒక తెలుగు కవి శ్రీనాథుడు! ఈయన మాటలలో నుండి ఎన్ని శతాబ్దులు గడచినా, ఎప్పటికప్పుడు క్రొత్తగా- అక్షయ్యమైన కస్తూరీ సౌరభం తెరలు తెరలుగా వీస్తూనే ఉంటుంది.''

## పోతన

''ఏ జాతి అయినా తరించటానికి ఇటువంటి కవి ఒక్కడు ఉంటే చాలును''

- మల్లంపల్లి శరభయ్య

# నేను నేనుగా వుంటా

- టి. వాసుదేవరెడ్డి

నాలో రగిలే ఈ దైహిక జ్వాలల్ని
అగ్నిమాపక యంత్రాలతో ఆర్పడమా?
నా ప్రేయసి కిచ్చిన దినాన్ని
నిరవధికంగా పొడిగించటమా?
లేదా ఊసరవిల్లి కాషాయ వస్త్రాలమాటున
మత్త మదతప్త రుద్రాక్ష మాలల చాటున
భోగలాలస పాశాలను చుట్ట చుట్టి
హిమవన్నగ శైత్య ధారలతో
మరిగే ఈ రక్తం గడ్డకట్టనందాక
మంచు కొండల ఆశ్రమాలకు విసరి వేయడమా? -
కాని అవి విలువల్ని వలువలుగా మార్చలేవు
నిజ జీవితం బీజ గణితం కాదు
స్వచ్ఛమైన మానసిక పరివర్తన
నేటి కపట సాధువుల సులభ సూత్రాలకు అతీతం
గిరజాల బాబాల బాసలకు బహుదూరం
వేషాలూ మోసాలూ నాకొద్దు - నేను నేనుగా వుంటా



## శ్రీకృష్ణ దేవరాయలు

''శ్రీకృష్ణదేవరాయలు మూర్తీభవించిన వర్షఋతువు!''

## ముక్కు తిమ్మన

''సాయంకాలం పూసే చంద్రకాంతం పూవంత సుతిమెత్తనైన ఒకే ఒక తెనుగు కవి ముక్కు తిమ్మన!''

- మల్లంపల్లి శరభయ్య

# పునాదిరాయి

- అనంత వెంకటేశన్

ఎంత మోసపోయాను!
జీవించడం ఎవరో నేర్పిస్తారని
ఎంత గుడ్డిగా నమ్మాను!!
ప్రపంచమంతా ఇంతగా పరిగెడుతున్నా
నేనేమిటి మందకొడిగా మిగిలిపోయాను!
కాలం మూడు పదుల సార్లు
నా పుట్టిన తేదీ గుండా పరుగు తీసినా
చేయి వీడని తండ్రి చూసి
అదంతా నా పై వాత్సల్యమే ననుకున్నా
మూడు పుష్కరాల కాలం దాటిన తరువాత తెలిసింది
మూడు లక్షల కోసమని!!
ముదిరి పోయావని అందరూ అంటే దిగులేసింది కానీ,
వధువు కోసం ఇంటి కెళితే తెలిసింది
ఆమెకు నేను చిన్న వాణ్ణై పోతానని!!
మరో నిర్భాగ్యజీవి ఉందా?
'ఒక్కరు కాదు; వందలు, వేలు ఉన్నా'రన్నా రెవరో
'మరి మిన్నకున్నారే?' అడిగాను
'నీలాగే!' అన్నారు
'అంటే పాము గుడ్లు పామే తినే సంస్కృతా మనిషిది?'
'అబ్బో! చాలా వెనకబడి ఉన్నావు! ఇన్ని తరాల కుళ్ళు
నీ కెక్కడ చూపను?' నన్నొదిలి వెళ్ళిపోయారు.
ఎట్టకేలకు ఓ సంబంధం వచ్చింది
నా జీతమెంతని అడిగారు
ఉద్యోగమే లేనిది జీతమేమిటనుకున్నాను
'మీరిచ్చే కట్నంపై ఉంటుంది మా అబ్బాయి జీతం' అన్నాడు
నాన్న
నా కర్థం కాలేదు
వాళ్ళ కర్థమయింది కాబోలు!
మూడు లక్షలతో ముత్యాల బొమ్మ నిచ్చారు
కట్నం బ్యాంకులో వేసి

'నెల నెలా వచ్చే వడ్డీనే నీ జీ(వి)తం రా నాయనా' అన్నాడు నాన్న
అమ్మకు ఇంకా ఏదో చాల్లేదుట! సణుగుతోంది!!
అర్హత లేని వారి గెలుపు
అన్నీ ఉన్నవారి ఓటమి
ఏమిటి ఈ చదరంగం?
అన్ని అంశాలలో అన్నీ దారుణాలేనా??
ఎవరూ గొంతు చించుకుని అరవరేం???
పిల్లి మెడలో గంట సామెత కాబోలు
సరే,
అది నేనే మొదలు పెడతాను
వచ్చే తరానికైనా ఓ పునాది రాయి నవుతాను



ఆంగ్ల కవిత:

## శిల

స్పష్టించాలనే స్ఫూర్తి కలగాలంతే
ఆకారం లేని రాతి రూపంతో కలుస్తుందొక శిల్పి హృదయం
ఆ ఆత్మల సంగమంలో
వికసిస్తుందొక సజీవ శిల్పం.
అర్థం లేని సజీవ, నిర్జీవ రూపాలపై
ప్రసరిస్తుందొక కళాకారుని దృష్టి
సంతరించుకుంటాయవి
నవ్య రూపం, జీవం, వర్ణం
శబ్దాల మృణ్మయ రూపాలు
పద చిత్రాల వడగండ్లు
భావాలోచనలుగా
క్రమంగా మాటలుగా
నిండైన కవి పల్కుల వరవడిగా
ఇంపైన మంత్రోచ్చారణగా
పొంగి ప్రవహిస్తాయి.

(టి.ఎస్. ఎలియట్ 'ది రాక్' నుంచి తీసుకున్న పద్య భాగానికి స్వేచ్ఛానువాదం)

- అనువాదం: ఎమ్. శ్రీధర్

# దోమకు తెలుసు

చిన్నదే ఐనా దోమకు బాగా తెలుసు
ఇతరులను హింసిస్తూ బతుకుతున్నానని ,
ఐనా,
తన కడుపు నిండేంతవరకే తాగుతుంది
నా రక్తాన్ని బ్లడ్ బ్యాంకుల్లో దాచదు.

(డి.హెచ్. లారెన్స్ 'ది మస్కిటో నోస్'కు స్వేచ్ఛానువాదం)

అనువాదం: ఎమ్. శ్రీధర్

# తుదిమాట

రాళ్ళ నడుమ పూలు పూయడం
అంద విహీనులూ మంచి పనులు చేయడం
తక్కువ జాతి గుర్రం రేసులో గోల్డ్ కప్ గెల్చుకోవడం -
అన్నీ చూశా. అందుకే నా నమ్మకం నిండుకోలేదింకా.

(జాన్ మేస్‌ఫీల్డ్ ''ఎన్ ఎపిలోగ్''కు స్వేచ్ఛానువాదం)

అనువాదం: ఎమ్. శ్రీధర్



హిందీ కవిత:

# నాకోసం కాకపోయినా

\- నరేశ్ మెహతా

రోజా రాకపోయినా -
అయితే నువు రోజా రావాలనే నా ఆకాంక్ష.
నువ్వొస్తున్నప్పుడు
గుమ్మం దగ్గరి గరికలో
నీకోసం నిరీక్షణ లిఖించబడి లేదా?

నేనే కాదు, ప్రియా!
యిల్లుయిల్లంతా నీ కోసం
ప్రతీక్షా రత నయనయై చూస్తున్నది.
ఏ రోజయినా వచ్చి చూడు -
నీ రాక మాత్రం తోనే
యింట్లోని వస్తువులు సైతం
ఎన్నో రోజుల తర్వాత
నిబిడ నీ రంధ్ర వృక్షచ్ఛాయ లభించినప్పటి
సంధ్యాకాల విహంగాల వలె
కలకూజితాలుగా మారిపోతాయి.
నా కంటె ఎక్కువగా
యీ మాధవీలత
ఎప్పట్నుంచో నీ రాకకోసం ప్రతీక్షిస్తోంది -
నువ్వొస్తే
నిన్ను
తన పూలతో అభిషేకించి
చరితార్థయై పోవాలని.
నే నీ మాధవితో అన్నాను కూడా -
యింతటి వ్యాకులపాటు
యీ ఏకాగ్ర నిరీక్షణ
వ్యర్థమని.
అయినా యీ పిచ్చిది -
సుమభారంతో గాలికి ఊగి ఊగి పడుతున్నది కాని
ఎవరికీ తన సుమనాల్ని అర్పింపలేదు -
'తనవారు' వేరే కదా మరి!
నా కోసం కాకపోయినా
అనామకమైన యీ గరిక నిరీక్షణ కోసం...
యింట్లోని వస్తువుల సాధారణ ప్రసన్నత కోసం...
మాధవీలత యొక్క యీ విహ్వలభారం కోసం అయినా -
రా
రోజూ రాకపోయినా -
అయితే నువు రోజూ రావాలనే నా ఆకాంక్ష.

**అనువాదం: యల్లటూరు శివరామిరెడ్డి**

# గీతాంజలి ఆల్బమ్ : పరిచయ వ్యాసం

- అల్లాడి ఉమ

ఎమ్. శ్రీధర్

భయం లేకేం! చచ్చేంత భయం వేస్తుంది.
అంత మాత్రం చేత ఏమైపోతుందోనని
చింతిస్తూ కూర్చోవడం నా కిష్టం లేదు. ఈ
అనారోగ్యం నా జీవితంలో ఓ చిన్న భాగం
మాత్రమే. జీవించడంలోనే ఉంది జీవితం.
దేవుడిచ్చిన ఈ కొద్ది జీవితాన్ని వీలైనంత
హాయిగా జీవిస్తాను.

**గీతాంజలి ఆల్బమ్** చివర్లోని ఈ మాటలు మొత్తం సంకలనం సారాంశాన్ని స్ఫురింపజేస్తాయి. పదహారేళ్ళ జీవితంలో కాన్సర్ రూపంలో మృత్యువు వెంటాడుతున్న నేపథ్యంలో ఎన్ని అనుభవాలు! బాధ, చిరాకు, నిరాశ, కొన్ని సార్లేమో చెప్పలేని ధైర్యం, ఆశ, నమ్మకం, ఒకవైపు స్పెల్లింగ్, వ్యాకరణ సంబంధమైన తప్పులూ, మరోవైపు మరణాన్ని ఎదుర్కొంటూ చెప్పే మాటల్లో అపురూపమైన పరిపక్వత మనకు కొట్టొచ్చినట్లు కనిపిస్తాయి. చావుతో తాను చేస్తున్న యుద్ధంలో ఎన్నో ఆలోచనలు - నిరాశను, భయాన్ని ప్రకటించేవి కొన్నైతే, చావుతో రాజీపడేవీ, చావును ఆహ్వానించేవీ, ధైర్యంగా ఎదుర్కొనేవీ, ధిక్కరించేవీ మరికొన్ని.

అంత చిన్న వయసులో చావు అనివార్యమని తెలిసినపుడు నిరాశ తప్పదు. ఇక సంతోషం గురించి కలలుకనడం అవసరమనిపిస్తుంది తనకు:

''ఒకప్పుడు కలిసే ఉన్నాం
మనమిద్దరం
మరిప్పుడో!
నేనందుకోలేనంత దూరంగా వెళ్ళిపోయావు
చెప్పు! నేనేం చేశానని నాకీ శిక్ష!

అని నిలదీసి అడుగుతుంది. సంతోషంతో గడిపిన పాతరోజులు మళ్ళీ రావాలన్న గాఢమైన కోరికా, దాంతోపాటు అలా కోరుకోవడంలోని నిష్ప్రయోజనం రెండూ కనిపిస్తాయి మనకు:

''మరోసారి నన్ను సంతోషపెట్టాలనుకుంటే
పాత రోజులు నెమరు వేసుకునేందుకైనా
కాస్తెక్కువసేపు గడుపుదాం.
మళ్ళీ విడిపోవలసి వస్తే -
తిరిగి మాత్రం రాకు.
నా కలల్ని తట్టి లేపకు.''

అటువంటి కలలు కూడా పూర్తి సంతోషాన్నివ్వవు. కలలు చెదిరినపుడల్లా

''చావు పంచన కూర్చొని
కాలం
తెగిపోతున్న హృదయ తంత్రుల్ని
మరింత బలంగా లాగుతున్నట్లు
భరించలేని మనోవేదన''

అందుకే చావంటే భయం. రేపంటే భయం. రేపెలా ఉంటుందోనన్న అనుమానం ''సూర్యుని వెలుగు'' కవితలో కనబడుతుంది.

''పగలు
రాత్రిని కలిసే
ప్రతి సాయంకాలం
కిటికీలోంచి
అస్తమించే సూర్యుణ్ణి
చూస్తుంటాను.
వెలుతురు సన్నగిల్లి
కాలం మౌనంగా
ఒంటరితనంలోకి
జారుతున్నప్పుడు
నా మనసు
ఆత్మావలోకనం
చేసుకుంటుంది:
రేపటి వెలుగును
మళ్ళీ చూడగలనో, లేనో అని.''

నడి సముద్రంలో పడవల్ని బలంగా ఊపేస్తున్న మృత్యుముఖాన్ని చూస్తూ

''నా జీవిత నౌకను కూడా
ఏదో కనపడని పెను తుఫాను ఆవరించింది''

అంటుంది. మితిమీరిన భయం ఓ మొండి ధైర్యాన్నిస్తుంది. ఈ ధైర్యంతోనే మరణాన్ని ధిక్కరిస్తుంది.

''ఉదయం రాక మానదు.
దుఃఖాన్ని, శూన్యాన్ని చీల్చుకుంటూ
నవ్వును ప్రసరిస్తూ
రాక తప్పదు''

అంటూ తననావరించిన అనాసక్తిని కుదిపేస్తుంది. ఒకే కవితలో చావు తప్పదనే జ్ఞానం, సమాధాన పడిపోయే తత్వం రెండూ తొంగి చూస్తాయి. ఇలాంటి భావాలు ''మరణమా మెల్లగా నడచిరా'' కవితలో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.

''మరణమా
నీ గురించి నాలో
విభిన్న భావాలు
మెదుల్తున్నాయ్.
కొన్నిసార్లు భయం.
కొన్నిసార్లేమో
నువ్వెప్పుడొస్తావోననే
ఎదురుచూపు.

నా దొక్క మనవి
ఎపుపడొచ్చినా సరే
చెప్పకుండా వచ్చెయ్
ఎందుకంటే
ఈ ఇంట్లో
ఇప్పటికే చితికిన హృదయాలు
ప్రేమించే,
సంరంక్షించే,
పైకి ధీమాగా కనపడ్డా
లోలోనే పరితపించే
హృదయాలున్నయ్

నువ్వు చేజిక్కించుకునున్న నన్ను
కాపాడుతున్నది వాళ్ళే.
వాళ్ళు నిద్రపోతున్నపుడు కానీ
నేను నిద్రలో ఉన్నప్పుడు కానీ
తీసుకుపోనన్ను.
ఎడాబాటెవరికైనా బాధే కదా-
ముఖ్యంగా మొలకెత్తినప్పట్నుంచీ
పుష్పించినంత వరకూ
నన్ను పెంచిన వాళ్లకు.

మరణమా
మెల్లగా నడు
నా భయం అంతా వాళ్ళ గురించే
మరీ అంత కటువుగా ప్రవర్తించకు
పట్టు సడలించు
హృదయం లేని వాళ్ళుండే
ఈ క్రూర ప్రపంచం నుంచి
నన్ను తప్పిస్తున్న
ఆ దేవుడికి
కృతజ్ఞతాంజలి
సమర్పించుకోడానికైనా
కొన్ని కన్నీళ్ళను దాచుకోనీ.''

కాన్సర్‌తో తాను శారీరకంగా, మానసికంగా అనుభవిస్తున్న బాధను తలచుకున్నప్పుడు చావే ఊరట కలిగించేదిగా తోస్తుంది:

''నన్ను వంశ చేసుకోవాలనుకుంటున్న
చావును చూస్తే భయం లేదు నాకు
నా రెండు చేతుల్తో
సంతోషంగా ఆహ్వానిస్తాను''

- అంటుంది. చావును ధైర్యంతో ఎదిరించే కవితలకిది నాంది పలుకుతుంది.

'నా రాతను కాలరాస్తాను' అనే కవితలో
''నిన్నూ
నాలా నవ్వుతూ

చూడాలనుంది.
నువ్వెదురుగా నుంచున్నా
భయపడే వాళ్ళెవరు!''

- అని ప్రశ్నిస్తుంది. చావుపట్ల ఇంత ధైర్యానికి దేవునిపై ఆమెకున్న అంచంచల విశ్వాసమే కారణం.

''అందుకే
ఎంతో విశ్వాసంతో
నువ్వు నిలిపిన
దీప స్తంభాన్ని చూస్తూ
ప్రయాణిస్తున్నాను
నాజీవిత నావను నడిపి
ఒదరికి చేర్చే బాధ్యత నీదే!''

ఈ విశ్వాసమే తన బాధలను పూర్తిగా మరచిపోయి ఇతరుల గురించి ఆలోచించే ప్రేరణనిస్తుంది. తనెంత బాధలో ఉన్నా తనపెంపుడు కుక్క 'మోతి'ని గురించి ఇలా రాస్తుంది:

''నా హృదయం
నీ కొర కో ప్రార్థనా గీతాన్నాలపిస్తుంది
నీకు మరో తోడును చూపిస్తుంది.''

ఇలాగే తన గురించి బాధ పడే అమ్మా, నాన్నలను, స్నేహితులను ధైర్యంగా ఓదారుస్తుంది.

ఇలా చిన్న చిన్న మాటల్తో, క్లిష్టమైన భావాల్నీ, ఆలోచనల్నీ అల్లుకుంటూ తన జీవితానుభవాల్ని తాత్విక దృష్టితో పరిశీలిస్తూ, మరపురాని కవితల్ని వెద చల్లుతూ సాగుతుందీ కవితా సంకలనం. హుందాతనంతో జీవించాలన్నదే తన కోరిక. మరణంలో కూడా అదే హుందాతనాన్ని కోరుకుంటుందామె. (గీతాంజలి మాటలు, కవితలు, కొన్ని కవితల్లోని పంక్తులూ స్వేచ్ఛానువాదాలు)

(గీతాంజలి షైై 11 ఆగస్టు 1977న తన పదహారోయేట కాన్సర్ వల్ల మరణించింది. తనను ఆప్యాయంగా చూచుకునే వాళ్ళెవరికీ, తను అనుభవిస్తున్న మనోవ్యథ తెలియకూడదని తన కవితల్ని భద్రంగా దాచింది. తర్వాత దొరికిన కవితల్ని కూర్చిన సంకలనమే ''గీతాంజలి ఆల్బమ్'').



# ఆమె

- యస్.ఆర్. పృథ్వి

కాలం పురుషుడు, కలం స్త్రీ
ఇది నా కొత్త సిద్ధాంత ప్రతిపాదన
అనంత రూపాల్లో సంచరించే పురుషుడికి
స్త్రీ హృదయమే విశ్రాంతి మందిరం
జన్మనిచ్చే మాతృత్వం ఆమెకే సొంతం.

వేగం, వెర్రి ఆనందమై పరుగులు తీసే కాలం
కలం కౌగిటిలో బందీయే
సిరా చుక్కల్లో కరిగి
తెల్లని కాగితంపై అక్షర నక్షత్రాలై మెరుస్తుంది
మానవగ్రాఫ్ కాగితంపైకి పొడుచుకొచ్చిన
జీవన గమనంలోని బహుముఖ కోణాలను
వాస్తవ రేఖా చిత్రంలో నిలదీస్తుంది
అందుకే కలాన్ని చూస్తే, కాలానికి భయం
రెప్పల మాటున ఒదిగిన కన్నుల్ని
కలత మేఘాలు తాకినప్పుడు ఊరిన చెమ్మకు
కల కరిగి, నిద్రాభంగమైనప్పటికీ
బొగ్గులా ఘనీభవించిన చీకటి
ఎన్ని భయానక ఆవర్తాలు సృష్టించినా
విశ్వ నేత్ర సంకేత సూర్య కిరణం
తొలి చూపుల అలికిడికే
చిల్లులు పడటం ఆరంభమవుతుంది
అందుకే, కలాన్ని చూస్తే కాలానికి భయం.
యుగాలు మారినా, హృదయాలు రగిలే నిజాల్ని
చరిత్రగా చెక్కి, గ్రంథాల గనుల్లో
సాహసపు ఊపిర్లు పీలుస్తూ నిక్షిప్త పరుస్తుంది.
కాల ప్రవాహ వేగాన్ని త్రోసి
అపస్వరాలన్నింటినీ వడబోసి
ఇంకిన నదిలో ఇసుక మేటలా

మలినపడ్డ విలువల్ని నగ్నం పరుస్తుంది.
కాల సర్పం విషదంష్ట్రల క్రింద
ఎన్ని తరాలు కరిగిపోయినా
ఏ తరాని కాతరాన్ని విడదీసి
గోదావరి పాయల్లా
జీవించే సంప్రదాయాన్ని ప్రవహింపజేస్తుంది.
అంతర్వాహినిలో సైతం లీనమైన
ఎయిడ్స్ రంగు పులుముకున్న
స్వార్థం క్రిములను వలపట్టి
భవిష్యత్తరంముందు విశ్వరూపంలా ప్రదర్శిస్తుంది
అందుకే కలాన్ని చూస్తే, కాలానికి భయం.

పురుషాహంకారాన్ని భరించేది
త్యజించేది, చివరికి ఛేదించేది
అమ్మలా, భార్యలా... ఆమె.



నీ గుండె ఒక గాయాల లైబ్రరీ శేషన్!
చిక్కుపడిన దారాలు జీవన మార్గాలు
నీవాళ్లెవరు కారో నీకు తెలీనీవు
నీవు నిలబడ్డ భూమి కూడా
నిన్ను వంచించదని చెప్పలేవు
బాధితుల క్యూలో నుల్చుని దర్శించు జీవితాన్ని
సిగ్గు విడిచి దేవుడికైనా మొక్కు
మొక్కిన చేతిని కూడా మింగే
మనిషికి మాత్రం మొక్కబోకు!

- శేషేంద్ర

అనుబంధం:

# కవితా కదంబం

సరసుడు
సహృదయుడు
సాహిత్య రసికుడు
సంస్కృతాంధ్రముల సవ్యవాచి
కవి
పండితుడు,
ప్రసిద్ధ పరిశోధకుడు
ఉత్తమ దేశికుడు
అయిన

## ఆచార్య జీరెడ్డి చెన్నారెడ్డిగారి

సహస్ర పూర్ణచంద్ర దర్శనోత్సవ శుభ సందర్భంగా
వివిధ కవులు అర్పించిన కవితా కదంబం

*(ఈ ఉత్సవం 1996 జనవరి 31వ తేదీని బుధవారం నాడు తిరుపతిలో జరిగింది)*

# సహస్ర పూర్ణ చంద్ర చంద్రికలు

- తంగిరాల సుబ్బారావు

రాముడు నీల మేఘశ్యాముడు
కృష్ణుడు కువలయ దళ నీలుడు
ఏడుకొండల మీది దేవుడు
చీకటి చెట్ల చిగుళ్ల జిగిని మిగిలిన
గరగరని మేని నిగనిగల వాడు
కొండ క్రింది మా గురుడు
ఈ ముగ్గురినీ మించిన వీరుడు!
ఒక్క రంగులోనే కాదు,
లెక్కలేని గుణగణాలలోనూ.

రెడ్డిగారు పక పక నవ్వితే
రేనాటి సీమలో నల్లరేగడి భూమిలో
ప్రత్తి చేను తెగ పండినట్టు!
జన్మాష్టమికి ఉట్టి కొట్టినట్టు!
మరకతమణి రాశిపై మల్లెపూల మాల పెట్టినట్టు!

ఆ నల్లని వెంకన్నకు అర్ధాంగి
తెల్లని కొమ్మ
ముద్దుల గుమ్మ
అలర్‌మేల్ మంగమ్మ!
ఈ నల్లని చెన్నన్నకు కూడా
అర్ధాంగి కమలమ్మే!
బంగారు బొమ్మ
బంధుకోటికి కల్పవృక్షపు కొమ్మ!

పాత ప్రవచనంలో -
ఎల్లప్పుడూ ఆనందం సరిగంచు మల్లు పంచె
చిరునవ్వుల సిల్కు టపేటా లాల్చీ
సంస్కృతాంధ్రాల జరీ కండువా -
పరిశోధనలో ప్రవేశించగానే
సూటూ బూటూ హేటూ!

రాయలసీమ శృంగార జానపద కథాభాగాలు
మీ పుక్కిట బాగాలు.
గద్వాల సంస్థానంలో సత్కారాలు పొందిన
తాతతండ్రుల అశేష శేముషీ వైభవ తరంగాలు
మీ పాండిత్య పంచకల్యాణీ తురంగాలు.

అరవై యేళ్లు నిండిన ఈ తల పండిన శిష్యుని దీవిస్తూ
ఎనభై ఏళ్లు నిండిన మీరు అచ్చంగా భీష్మాచార్యుల వారు!
సహస్ర చంద్ర చంద్రికలు దర్శించిన ఓ గురువర్యా!
జీరెడ్డి వంశ క్షీరసాగరానికి మీరు నిండు పున్నమి చంద్రుడు!
*(అయితే ఈ చంద్రుడు లీలాశుకుడు చెప్పిన*
*'నీల నిశాకరుడు')*

సంపూర్ణాయుర్దాయంతో
చక్కని ఆరోగ్యంతో
సమస్త భోగభాగ్యాలతో
నిండు నూరేళ్లు జీవించాలని
శ్రీనివాసుని ప్రార్థిస్తున్నాను.
జానపదవాణిలో శ్రమించిన నేను
జానపద బాణిలోనే మీకు శుభం పలుకుతున్నాను...



శ్రీ రమ్యవక్షుండు శ్రిత వత్సలుండు
కారుణ్య ధాముండు కనకాంబరుండు
వారిజ నేత్రుండు వనద గాత్రుండు
శ్రీ రమాధీశుండు సిరులిచ్చుగాక!

నాగ జందెము వాడు నాగభూషణుడు
నాగ బంధము బొజ్జ నడి కట్టువాడు
బేసి కన్నులవాని పెద్ద కొమరుండు
వాసిగా మిముగాచు భాసమానముగ।

బ్రహ్మపుక్కిటి కొమ్మ! పణతి మాయమ్మ!
ఒనరంగ శశిబింబ! ఓ శారదాంబ!
జగదంబ శారదయు జయమిచ్చుగాక!
కమల గర్భుడు మీకు విమల యశమిచ్చు
కాపాడు మిమ్మెపుడు గౌరమ్మ విభుడు
కాళహస్తీశుండు, కాశినాథుండు,
శ్రీ గిరిలింగంబు, చెన్న కేశవుడు,
ఏడుకొండల సామి ఎల్లవేళలను
వరములిచ్చుచు నుండ వర్ధిల్ల గలరు
వినవయ్య గురువర్య! విశదంబుగాను.



''శతమానం భవతు శతాయుః పురుషః
శతేంద్రియ ఆయుష్యేవేంద్రియే ప్రతి తిష్ఠతు!''



# కైమోడ్పు

- పోచిరాజు శేషగిరిరావు

చెన్నారెడ్డి మహామనీషి బుధరాజీవుండు సర్వాంధ్ర సం
పన్నం బాయన సాహిత ప్రభుత - సమ్మాన్యమ్ము సార్థక్యమై
చెన్నారెన్ పరిశోధకాగ్రణిగ, రాశీభూత సౌజన్యమై,
ఎన్నో సత్కృతు లందుకొన్న ఘనుడై యేపారె జీరెడ్డిజీ.

చేరిన శిష్యులన్ బుధ విశిష్టుల జేసె, నిరంతరమ్ము వి
ద్యారణి వెల్గులోపల - మహా కమనీయము చిత్తవృత్తి శ్రీ
భారతి సేవలో గడపె ప్రాయము నంతను, నెన్నదేండ్లు వి
ద్యాతురుడై చరించె - శతధా సుఖియించుత 'సెంచరీ'లతో.

అల సహస్రమాసోత్సవమైన మూర్తి
వేయి పున్నమి చంద్రుల వెలుగులోన
జీవితము దిద్దుకొన్న ప్రజ్ఞావిభాసి
జే.సి. రెడ్డి గురున్ గొల్తు చేయి మోడ్చి!

# పూజా పుష్పం

- పి.వి. అరుణాచలం

ఆరాధింతుము శిష్యులెల్లరము మా ఆచార్య జీరెడ్డి చె
న్నారెడ్డిన్ గురుదేవుడంచు నెద లానందాబ్ధిలో తేలగా
ధీరోదాత్తుడు, వేయి పున్నముల దీప్తింగన్న ధన్యుండు, సం
స్కార స్ఫూర్తికి దోహదమ్మిడెడి విక్రాంతుండు, స్తుత్యుండహో!

# విరి కానుక

- సంధ్య

చిన్నయ సూరిలోని సిరి ఛందస్సును కాను
అనంత విశ్వంలోని చిరు సంధ్యను నేను

కొంత జ్ఞానంతో మరికొంత అజ్ఞానంతో
చేశానొక చిన్ని రచనగా
సమర్పించాలని విరి కానుకగా.....

మట్టిలోని మాణిక్యానికి ఎంతటి జిగియో
కడపవాసి మామయ్యకు అంతటి బిగి
చిలుక ముక్కుకు దొండపండు ఎంతటి పండుగో
మామ చెన్నాకు అత్తకమల అంతకంటె మెండు!

ఎనభై వత్సరాల ఋతువులతో
యాభై నాలుగు వత్సరాల అర్ధాంగి సాంగత్యంతో
సాఫీగా సాగిన వీరి జీవన యాత్ర
కన్నుల పండుగగా, నిండు నూరేళ్ళుగా
వర్ధిల్లాలని ఆశిస్తూ...

- మేనకోడలు



# గురువర్యులు శ్రీ చెన్నారెడ్డిగారికి నమస్సుమాంజలి

- భాస్కర స్వర్ణాంబ

దీక్షాదక్షత కల్గిన, మంచి మనసు కల వ్యక్తులు,
ఉన్నతి పొందుట తథ్యం; సన్నుతినందుట యును సత్యం;
గుడిలోన దివ్వెను పోలిన గురువర్యులు వారు,
శిష్యులలో జ్ఞానజ్యోతి వెలిగించిన ఆచార్యులు!!
సంస్కృతాంధ్రభాషలలో పాండిత్యం నెరపి,
కావ్య కడలి లోతులను అరసి తరచి చూసి,
స్నిగ్ధ భావమౌక్తి కాల విద్యార్థుల కందించి,
శిష్యుల ఔన్నత్యానికి పాటుపడిన గురువర్యులు,
సదా మాకు పూజ్యులు, వారే శ్రీ రెడ్డిగారు!!
పాండిత్యం బోధనతో రంగరించి పోసి,
అలరించే సంవిధాన చాతురినే కూర్చి,
బోధించిన పాఠాలవి, ఎన్నటికీ మారువలేము.
సారళ్యంవారి మనం, సౌజన్యం వారి ధనం,
శిష్యులపై వాత్సల్యం, కురిపించే సహజగుణం
పదవులకే వన్నె తెచ్చి పరిఢవిల్లు నిర్మలత
గురువుగారికే సొంతం, మంచితనం, మానవత!!
నిస్వార్థం వారి ఆస్తి, చిత్తశుద్ధి వారి శక్తి,
భేషజమేలేని వ్యక్తి, వారి నడత మనకు స్ఫూర్తి!!
నాల్గు పదులు దాటనట్టి నవయువకుల్లా మీరు,
ఎనిమిది పదులు దాటాయని ఎలా అనుకోం మాస్టారూ?
ఇల్లాగే కలకాలం వేల చంద్ర ఉదయాలను,
దర్శించాలని కాంక్ష, దైవానికి మా ప్రార్థన,
కారుణ్యాంశుడు మన, శేషాద్రి నివాసుడు తన
చల్లని చూపుల వెన్నెల, ప్రసరించును మీ పైన!!
ఆ శ్రీనాధుని చూపుల, పన్నీటను తడసినట్టి
ఆశీఃకుసుమాలజల్లు, వర్షించు తమీపైన

- మీ పూర్వ విద్యార్థిని
తిరుపతి

# కవితాలేఖ

**- వేటూరి ఆనందమూర్తి**

''బుల్లా సుబ్బారాయని
చల్లని వీడిది యటంచు చాటెను మిత్రుం;
డుల్లము కొల్లగొనే మీ
సల్లాపము దానికీడు, చక్కన మఱియున్.''

''పున్నయ్యగారి యల్లుని
మన్నన మర్యాద తీరు మధుమధురమగున్,
చెన్నగు ''నీడ'' యుఁ జాటును
కన్నడ రాజ్యానఁ దమకుఁ గల ప్రాభవమున్.''

''తంగిరాల మిమ్ము తలపోసి పాస్పోర్టు
సంతకాల కృషికి చాలువేసె,
చెల్లెమీదు మాట, జిల్లాధికారితో
పనియునాయె, సెలవు, వందనాలు.''

(ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు ఏదో పనిమీద బెంగుళూరు వచ్చారు. ఒక విషయంలో వారికి ఒక ఐ.ఎ.యస్. ఆఫీసర్ సహాయం కావలసి వచ్చింది. నేను వారిని మా చైతన్య కవితా వేదిక ఉపాధ్యక్షులైన శ్రీ బుల్లా సుబ్బారావుగారి దగ్గరకు తీసికొని వెళ్లాను. ఆ పని నిమిషాల మీద చేసిపెట్టారు సుబ్బారావుగారు. ఆనందమూర్తిగారు హైదరాబాదు వెళ్లి, సుబ్బారావుగారికి కృతజ్ఞతాపూర్వకంగా ఒక కవితా లేఖ వ్రాశారు. బుల్లా సుబ్బారావుగారు స్వాతంత్ర సమర యోధులైన శ్రీ కోట పున్నయ్యగారి అల్లుడు. వీరి యింటికి ''నీడ'' అని పేరు - తంగిరాల)



''అల్లా, యెహోవ, రాములు
ఎల్ల శుభంబుల నొసంగి ఎప్పుడు బ్రోవన్
బుల్లా సుబ్బారాయా!
చల్లగ వర్ధిల్లుమయ్య సరస విధేయా!''

- టి.వి.కె. సోమయాజులుగారి చాటువు

# చైతన్య కవితా వేదిక

## బెంగుళూరు

| | | |
|---|---|---|
| గౌరవాధ్యక్షులు | : | శ్రీ టి. పట్టాభిరామరెడ్డి (పతాభి) |
| అధ్యక్షులు | : | శ్రీ డి.కె. ఆదికేశవులు |
| ఉపాధ్యక్షులు | : | శ్రీ బుల్లా సుబ్బారావు ఐ.ఎ.ఎస్. |
| | | శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠి |
| | | శ్రీ కె.పి. రావు |
| | | శ్రీ వై.వి. వెంకటేశ్వరరావు |
| | | శ్రీ జె. బాపురెడ్డి, ఐ.ఎ.ఎస్. |
| కార్యదర్శులు | : | ఆచార్య తంగిరాల సుబ్బారావు |
| | | డా. ఆర్వీయస్ సుందరం |
| సహకార్యదర్శులు | : | డా. దివాకర్ల రాజేశ్వరి |
| | | డా. పి.యు.బి. శర్మ |
| | | డా. కె. చంద్రప్ప |
| | | డా. ఎం. రుక్మాంగద నాయుడు |
| | | శ్రీ వి. రామనరసింహారెడ్డి |
| కోశాధికారి | : | ఆచార్య సరగు కృష్ణమూర్తి |

**మహారాజపోషకులు:**

శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులు

శ్రీనివాసాట్రస్టు, బెంగుళూరు - చిత్తూరు

**రాజపోషకులు:**

శ్రీ తిక్కవరపు పట్టాభిరామరెడ్డి, (పతాభి) బెంగుళూరు

# చైతన్య కవిత

## 1996లో చేరిన చందాదారులు:-

### జీవిత సభ్యులు :-

1. శ్రీమతి సరోజినీ ప్రేమ్‌చంద్, మద్రాసు.
2. శ్రీ పాతమత్తిగిరి సుబ్రహ్మణ్యం, మత్తిగిరి, హోసూరు కారికల్ ఫారం, ధర్మపురి జిల్లా, తమిళనాడు.
3. శ్రీమతి కమలమ్మ, ఆచార్య జీరెడ్డి చెన్నారెడ్డి దంపతులు, తిరుపతి.

### ప్రత్యేక సభ్యులు:-

1. డా. జి. రెజీనా, విజయవాడ
2. శ్రీ రాయప్రోలు భగవాన్, భీమవరం, పశ్చిమగోదావరి జిల్లా
3. శ్రీమతి సి. సంధ్య, హైదరాబాదు
4. శ్రీ పుల్లాడ తిక్కన సోమయాజి, కడప.

### వార్షిక సభ్యత్వం: (గ్రంథాలయాలకు మాత్రం)

1. శ్రీమతి ఇందిరాగాంధి స్మారక గ్రంథాలయం, హైదరాబాద్ విశ్వవిద్యాలయం, హైదరాబాదు.
2. తెలుగు విశ్వవిద్యాలయం గ్రంథాలయం, తెలుగు భవనం కాంప్లెక్స్, హైదరాబాదు
3. తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం, రాజమండ్రి
4. కాకతీయ విశ్వవిద్యాలయ గ్రంథాలయం, వరంగల్లు

# తంగిరాల సాహిత్య పీఠం - బెంగుళూరు

## ధాత ఉగాది పురస్కారాలు

1. ఉత్తమ పద్యకవి : శ్రీ ర.స. రాజు (తణుకు) - పింగళి అవార్డు.
2. ఉత్తమ వచన గేయ కవి : డా. తల్లావఝ్ఝల పతంజలి శాస్త్రి (రాజమండ్రి) తిలక్ అవార్డు.
3. ఉత్తమ పరిశోధకుడు : డా. అమళ్ళదిన్నె వేంకట రమణ ప్రసాద్ (కొవ్వూరు) - తిమ్మావఝ్ఝల అవార్డు.
4. ఉత్తమ విమర్శకుడు : డా. ముదిగొండ వీరభద్రయ్య (హైదరాబాదు) - దిగుమర్తి అవార్డు.
5. ఉత్తమ జానపద పరిశోధకురాలు : డా. రావి ప్రేమలత (హైదరాబాదు) తంగిరాల సీతామహాలక్ష్మి అవార్డు.
6. ఉత్తమ వక్త : శ్రీ నాగళ్ల గురు ప్రసాదరావు (విజయవాడ) - తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులు అవార్డు.
7. ఉత్తమ వేద పండితుడు : పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలూకా 'ఇరగవరం' గ్రామంలోని ఒక ఉత్తమవేదపండితునకు శ్రావణ పూర్ణిమ నాడు తంగిరాల వేంకట సుబ్బావధానులు గారి స్మారకంగా సత్కారం జరుగుతుంది.

- ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు

అధ్యక్షుడు, తంగిరాల సాహిత్య పీఠం

బెంగుళూరు

# SHANTHINIKETAN

Whitefield, Bangalore

Project Foundation Laid

By

**SHRI P.V. NARASIMHA RAO**

Hon'ble Prime Minister of India

On 17th November, 1995

**SHRI H.D. DEVE GOWDA**

Hon'ble Chief Minister of Karnataka

presided

Thanks to the economic and liberalisation policies of the Govt. of India under the able guidance of His Excellency, Shri. P.V. Narasimha Rao, Prime Minister of India and Govt. of Karnataka's initiatives for providing infrastructure for the development of Industry and Tourism, and the Government's policy of encouraging private entrepreneurs to develop infrastructure. Chaitanya Properties Pvt. Ltd. of the Audikesavulu Group has taken the lead in this field.

**SHANTHINIKETAN**

A home of one's own in Bangalore, even with the minimum of infrastructure is getting beyond the reach of the middle income group. It is in this background that Shanthiniketan, a new, integrated and self-contained facility is coming up. Shanthiniketan is 7 kms from the present Bangalore Airport and opposite to the Singapore Technology park in Whitefield.

Shanthiniketan in an area of 150 acres of land and with a project outlay of over Rs. 4,000 crores will have Residential Zones, Hospital, Educational Institutions, Community and Civic facilities, Parks, Hotels, Offices, Shopping Malls, Sri Sathya Sai Universal Centre state of the art International Convention Centre, etc.

## CLUB AND GOLF COURSE

Just 2½ kms away from Shanthiniketan is the Club and an 18 Hole Golf Course of international standards being developed by Chaitanya Properties. The facilities here will cater to Shanthiniketan, Sri Sathya Sai Universal Centre and others.

## AUDIKESAVULU GROUP

Shanthiniketan is one of the projects of the Property Development Division (Chaitanya Properties Pvt. Ltd.) of the well diversified Audikesavulu Group. One of the Directors of the Group, **Mr. K.M.Srinivasamurthy** is also the President of Federation of Karnataka Chamber of Commerce and Industry. **Mr. R. Premchander**, Managing Director, Amar Jyothi Spinning Mills Ltd. and **Mr. D.A. Srinivas**, Executive Director, Shree Vaani Sugars & Industries Ltd. are Directors of the Group. This professionally managed Group is engaged in Sugar, Steel, Food Processing, Breweries, Distilleries, etc. The Group has now entered the power generation sector as well.

## Shri A.N. HAKSER

Shri A.N. Hakser, (Former Chairman, ITC Ltd.,) the eminent corporate personality, is the Advisor to the project, Shanthiniketan.

## FEATURES OF THE PROJECT

1. High rise residential apartments
2. Mid rise apartments
3. Low rise apartments
4. Bunglows and Villas
5. Sri Sathya Sai Universal Centre state of the art International Convention Centre.
6. Delux Star Hotel with 400 Rooms
7. Shopping Complex
8. Office Block
9. Hospital
10. Research Centre
11. Club House
12. School
13. Park

## OTHER FEATURES

- Effluent Treatment Plant
- Uninterrupted Water Supply
- Stand-by captive power supply

**Phase I:** Between 24 and 36 months

**Phase II:** Within 60 months

## ARCHITECTS

i) Mr. Ramesh Khosla
Arcop Associates Pvt.Ltd.
Canada

ii) Sundaram Consultants
Bangalore

iii) Zacharia Consultants
Bangalore

## PROJECT ASSOCIATES

i) ECC Constuction Group
Larsen & Turbo Ltd.

ii) UNITECH Limited



చెన్నపురి కవికిశోర్

డా. యస్. బషీర్

# చైతన్యకవిత

23 ధాత వసంతం – APRIL 1996



చైతన్య కవితా వేదిక బెంగళూరు